భారతీయ సాహిత్య నిర్మాతలు

# ఫకీర్ మోహన్ సేనాపతి

ఆంగ్ల మూలం:
మాయాధర్ మాన్‌సింహ

తెనుగుసేత:
సి. ఆనందారామం

సాహిత్య అకాదెమీ
న్యూఢిల్లీ

# విషయ సూచిక

# ముందు మాట

ఈనాటి వరకూ ప్రశంసార్హమైనది కాదు, సరికదా, కనీసం పేర్కొన దగినదైనా ఫకీర్ మోహన్ సేనాపతి జీవిత చరిత్ర ఒరియా భాషలో కూడా రాలేదు. ఇందుకు కారణం కొంతవరకూ ఆ భాషలో వచ్చిన అతని ప్రతిభా వంతమైన ఆత్మకథ కావచ్చును. అతని జీవిత చరిత్ర వ్రాసే ప్రయత్నాల కన్నిటికీ అదే అడ్డుపడుతూ వచ్చింది.

అతడు మేధావి అనటంలో సందేహం లేదు. అయితే తనను గురించీ, తదితర వ్యక్తుల్ల గురించీ, మిగిలిన విషయాల గురించీ అతడు ఆత్మకథలో చెప్పినవే సర్వ సంపూర్ణ మని అంగీకరించటానికి వీలులేదు. అన్నింటి కంటే చక్కగా వ్రాయబడిన జీవిత చరిత్ర పాఠకులకు ఒక సంపూర్ణ స్ఫూర్తిని కలిగిస్తుంది – లేక పాఠకుల ముందొక సమగ్రమూర్తిని నిలుపు తుంది. ఎంత ఆసక్తిదాయకంగా ఉన్నా, ఆత్మకథ నుండి ఈ విధమైనది ఆశించలేము. అందుచేత సాహిత్య అకాడమీ దయవల్ల ఇంగ్లీషులో వచ్చిన ఈ చిన్న పుస్తకాన్ని ఫకీర్ మోహన్ నుండీ, ఇతరుల నుండీ లభించిన ఆధారాలను బట్టి అతని సాహితీ వ్యక్తిత్వాన్నే కాక మానవమూర్తిని కూడా చిత్రించటానికి సాధ్యమైనంత వాస్తవికతా దృక్పథంతో చేసిన ఒకపాటి పరిశోధనాత్మక ప్రయత్నంగా గ్రహించ వచ్చును.

1956 లో "బలాసోర్ (Balasore) ఫకీర్ మోహన్ సాహిత్య పరిషత్తు" వెలువరించిన సావనీర్ ఫకీర్ మోహన్‌ని వ్యక్తిగా చక్కగా చూపిస్తుంది. ఎందుకంటే, ఆ ప్రఖ్యాత నవలాకారుని స్వయంగా ఎరిగిన వారి "జ్ఞాపకాలు" ఆ సావనీర్‌లో ప్రచురింపబడ్డాయి. ఒరియా భాషలో సేనాపతి మీది సాహిత్య కృషి విషయంలో ప్రశంసార్హులైన వి ఒక్కరైనా ఉన్నారా అనుకొంటే, నేను వెంటనే ఏ సంకోచమూ లేకుండా "డాక్టర్ నటబార్ సామంతరే" (Dr. Natabar Samantaray) ని పేర్కొంటాను.

ఈ పుస్తకంలో పైన పేర్కొన్న సొవనీర్ నుండే గాక, సామంతరె పరి శోధనల నుండి గూడా పరిగణనీయమైన అంశాలనేకం సంగ్రహింపబడ్డాయి.

ఫకీర్ మోహన్ రచనా సంకలనాన్ని చక్కని ప్రతులలో వెలువరించి నందుకే కాక; ఫకీర్ మోహన్ కుమారుడైన మోహినీ మోహన్ సేనాపతి చక్కగా ఇష్టం వచ్చినట్లు సంగ్రహించిన ఫకీర్ మోహన్ ఆత్మకథను సవివరంగా వెలువరించినందుకు కూడా ఒరిస్సాలోని ఒక ప్రచురణ సంస్థ అయిన "మెస్సర్స్ కటక్ స్టూడెంట్స్ స్టోర్స్" అధిపతులు శ్రీ అనంతమిశ్రా గారికి మనఃపూర్వకమయిన కృతజ్ఞతలు చెప్పుకోవాలి. శ్రీ అనంత మిశ్రా గారికీ, కటక్‌లోని మరొక ప్రచురణ సంస్థ 'గ్రంథ మందిర్'కి అధిపతులైన శ్రీ శ్రీధర్ మహాపాత్రాగారికీ ఒక మహోన్నతుని గురించిన నా యీ అల్ప సంగ్రహ కథనాన్ని ప్రారంభించగానే ఫకీర్ మోహన్‌కి సంబంధించిన ప్రచురణలన్నీ అందించి సహకరించినందుకు స్వయంగా కృతజ్ఞుణ్ణి.

—యమ్. మాన్సింహా.

# 1

# మల్లికాషాపుర్ మల్లురు

ఫకీర్ మోహన్ ఒరిస్సాలోని 'పైక్-ఖండాయత్' (Paik - Khandayat) తెగలకు చెందినవాడు. ఈ తెగవారు స్వతంత్ర హిందూ రాజుల సేనానివహాల్లో తాము పొందిన పదవులనుబట్టి కాలానుగుణంగా లేకపోయినా ఈనాటికీ 'మల్ల', 'సింహ', 'భుజబల', 'బలయరిసింహ', 'శత్రుసాల', 'దళ బెహెరా' - లాంటి గౌరవ బిరుదాలనే వంశనామాలుగా చేసుకున్నారు.

## సేనాపతులు

ఫకీర్ మోహన్ సేనాపతి పూర్వీకులు మొదట మల్లురు మాత్రమే! ఈ మల్లురు కటక్ జిల్లాలోని కేంద్రపారా (Kendrapara) ప్రాంతం నుండి బలాసోర్ పట్టణ ప్రాంతాలలోని మల్లికాషాపుర్ గ్రామానికి వచ్చి చేరి సేనాపతులు కూడా కావటం ఆసక్తి కలిగించే విషయం. ఫకీర్ మోహన్ పూర్వీకులలో అయిదవతరం వాడయిన హనుమల్లు 'కేంద్రపారా' లో తండ్రి తాతల నాటి కొద్దిపాటి జమిందారీ భూములు అనుభవిస్తూ ఉండేవాడు. కానీ, ఏదో దురదృష్టవశాన అతడి ఆస్తిపాస్తులన్నీ హరించుకుపోయాయి. అతడు తన అదృష్టాన్ని వెతుక్కుంటూ యోధుడు కావలసి వచ్చింది శివాజీ తండ్రి తాతలు అహమ్మద్ నగర్ బీజపూర్ సుల్తానుల సేనలలో ఉద్యోగాలు చేసినట్లే, హనుమల్లు కూడా ఆ ప్రాంతాలను ఆక్రమించుకొంటున్న మరాఠుల దగ్గిర ఉద్యోగం సంపాదించి, తన వంశ ప్రతిష్ఠ పునరుద్ధరించుకోవాలనుకున్నాడు. కేవలం తన శక్తిసామర్థ్యాలే ఆధారంగా నెమ్మదిగా అతడు అత్యున్నతస్థాయి అందుకో గలిగాడు హనుమల్లు సేవలకు సంప్రీతుడైన

మరాఠీ గవర్నరు అతడిని ఎంతో విశ్వసించి 'సేనాపతి' అనే అపూర్వ గౌరవ బిరుదంతో బెంగాల్, ఒరిస్సా సరిహద్దులలో వున్న ఒక సైనిక దుర్గపు బాధ్యత సంపూర్ణంగా అప్పగించాడు. అంచేత హనుమల్లు తరువాతి తరాలలోని మల్లికాషాపుర్ మల్లురంతా సేనాపతులయ్యారు. అయితే కుటుంబాలలో జరిగే పుణ్య కార్యాలలో మాత్రం ఇప్పటికీ 'మల్ల' అనే ప్రాచీనమైన సహజ వంశ నామాన్నే వాడుతున్నారు.

## ఫకీర్ మోహనుని పితామహి

మరాఠాల నుండి బ్రిటిష్‌వారు ఒరిస్సాను స్వాధీనం చేసుకోక పూర్వమే 1803 లో హనుమల్లుకు తరువాతి మూడవతరం వాడయిన కుసా మఠా (Kusa Matta) ఇద్దరు కుమారులను, భార్యనూ వదలి చిన్నతనంలోనే మరణించాడు.

ఆ వితంతువే 'కుచిలాదే' (Kuchiladei). ఫకీర్ మోహన్ పైన ఈమె ప్రభావం ప్రగాఢంగా వుంది.

నిస్స్వార్థ సేవా పరాయణియైన దేవతామూర్తిగా ఆమె అతని రచనలన్నింటిలోనూ రకరకాలుగా సాక్షాత్కరిస్తుంది. అయితే 'కుచిలాదే' విషాద భరితమైన నిరాడంబరతవల్లనే బలాసోర్ జిల్లాలోని తాతల నాటి ఆస్తిపాస్తులను మల్లురు రెండవసారి పోగొట్టుకున్నారని ఫకీర్ మోహన్ తన ఆత్మకథలో చెప్పుకున్నాడు.

కుచిలాదే కుమారు లిద్దరిలో పెద్దవాడు పురుషోత్తమ్. చిన్నవాడు లక్ష్మణ్‌చరణ్. ఇతడే జనవరి 1843 లో ఫకీర్‌మోహన్ వంటి మహామేధావికి జన్మ నిచ్చిన భాగ్యశాలి. కానీ, లక్ష్మణచరణ్ పూరీ యాత్రనుండి తిరిగి వస్తూ దురదృష్టవశాన అతి చిన్నతనంలోనే భువనేశ్వర్‌లో కలరాతో మరణించాడు. ఈ విషాద సంఘటన సంభవించే నాటికి ఫకీర్ మోహన్ ఏడాది పైన అయిదు నెలలు పైబడిన పసివాడు మాత్రమే! అతని తల్లి తులసీదే యీ ఆఘాతానికి తట్టుకోలేక మంచ మెక్కింది. మరొక్క సంవత్సరానికే మృత్యు వామెను కరుణించి దుర్భర వైధవ్యం నుండి విముక్తి కలిగించింది. దురదృష్టవంతుడైన ఆ పసివాడికి ఏకైకాశ్రయం పితామహి కుచిలాదే మాత్రమే! తానే ఒక నిస్సహాయురాలైన వితంతు వామె!

# 2

# అశ్రద్ధచేయబడ్డ శిశువు

పన్నుల బాధలేని విస్తారమైన భూములన్నీ పోగానే మల్లికాషాపుర్ మల్లుర ధనాధిక్యపు డాబు దర్పాలన్నీ ఒక్కసారిగా నశించిపోయి సాధారణ బీదజనులలో కలిసిపోయారు. తండ్రిలేని కుమారు లిద్దరినీ కుచిలాదే ఎలా పెంచి పెద్ద చేసిందో మనకు తెలియదు. ఆ పుణ్యాత్మురాలు ఈ ప్రయత్నంలో తన జీవితమంతా ధారపోసిందని భావించవచ్చును. పిల్లలను పెంచి పెద్ద చెయ్యటంమాత్రమే కాదు – వాళ్లు యవ్వనంలో అడుగుపెట్టగానే వివాహాలు కూడా చేసింది తన సంతానం పెరిగి దృఢగాత్రులై సంపాదనపరులయ్యాక, తన అడుపాజ్ఞలలో వుండే కోడళ్లు ఇంట తిరుగాడుతోంటే, తన విషాద మయ జీవితంలో ఆ వృద్ధురాలు కొంతకాలం ఆనందించి వుండవచ్చును. ఆ కొద్దిపాటి సంతోషమైనా కొంతకాలంపాటు అనుభవించే అదృష్టం ఆమె నుదుట వ్రాసిలేదు కాబోలు! ముందు చెప్పినవిధంగా మృత్యుదేవత ఆమె చిన్న కొడుకునూ, కోడల్నీ వరసగా కబళించింది. దుఃఖితురాలైన ఆ విత౦తువు బాధ్యత మరింత గురుతరమయింది. నిత్యరోగి అయిన తన మనవడి మీది మమకారంతో ఆమె ఎలాగో ఈ దారుణాఘాతానికి తట్టుకోగలిగింది. దురదృష్టవంతుడైన ఈ రోగిష్టి శిశువే జాతీయ సాహిత్యాన్నంతా పునరుద్ధరించిన ఫకీర్ మోహన్ సేనాపతి.

## సేవాపరాయణియైన దేవత

విద్యావంతురాలు కాని ఈ నిర్మల నిరాడంబర పితామహి ప్రేమమయ స్మృతులు ఫకీర్‌మోహన్ రచన లన్నింటిలోనూ, వ్యంగ్యంగానూ ఆత్మకథలో మాత్రం మరింత ప్రగాఢావేశంతో సూటిగానూ కనిపిస్తాయి. ఇవి పాఠకులను కదిలించివేస్తాయి. సత్యమైన స్త్రీత్వపు మహత్వమెక్కడో నిరూపిస్తాయి.

అతడిలా అంటాడు :

"నా తల్లిదండ్రులు చనిపోయిన ఎడెనిమిది సంవత్సరాలవరకూ, నేను రక్తవిరేచనాలూ, నీళ్ళవిరేచనాలూ, మూలశంక మొదలైన రోగాలతో బాధపడుతూ అహర్నిశలూ మంచంలో పడివుండేవాణ్ణి. రాత్రింబగళ్లు మా నాయనమ్మ నా ప్రక్కనే కూర్చొని వుండేదని నాకు జ్ఞాపకం - రోజులు, వారాలు, నెలలు, చివరకు సంవత్సరాలు కూడా గడిచిపోయాయి. కాని, మా నాయనమ్మ నిద్రాహారాలు సంపూర్తిగా మరచి, అహోరాత్రులు విరామ మనేది లేకుండా నా మంచంపక్కనే కాచుకు కూచునేది! ఇదంతా మృత్యు దేవత ఒకవైపు మా నాయనమ్మ మరొకవైపు నన్ను దక్కించుకోవటానికి పోటీలు పడుతున్నట్లుగా వుండేది. చివరకు విజయం మా నాయనమ్మదే అయింది. నేను కోలుకోసాగాను.

బ్రజమోహన్ నుంచి ఫకీర్ మోహన్ కి

నేను దీర్ఘరోగాలతో బాధపడే కాలంలో మా పితామహి నన్ను కాపాడమని లోకంలో తనకు తెలిసిన దేవతలనందరినీ వేడుకుంది. ఆ కాలంలో బలాసోర్‌లో వున్న ముస్లిం 'పీర్లు' ఇరువురికి అర్తుల కోరికలు నెరవేర్చే మహత్తు ఉందని భావింపబడేది-బలాసోర్‌లోనూ, ఆ చుట్టుపక్కలా ఉన్న హిందూ దేవతలనందరినీ ప్రార్థించి ప్రార్థించి నిరాశచెందిన మా పితామహి చివరకు తన మనసుకున్న శక్తి అంతటితోనూ ఈ ముస్లిం ఫకీరులను ఆశ్రయించింది. తన మనవడు కోలుకుంటే, అతణ్ని ఫకీరుగా వారి బానిసగా సమర్పించుకుంటానని మొక్కుకుంది. నా అసలు పేరు బ్రజమోహన్. కానీ నేను కోలుకున్నాక మా పితామహి ముస్లిం 'పీర్ల' పట్ల కృతజ్ఞతతో ముస్లిం మర్యాదను కూడా జోడించి నా పేరు 'ఫకీర్ మోహన్'గా మార్చింది. నేను బాగుపడ్డాను కానీ నా పితామహి మాతృహృదయానికి నన్ను పూర్తిగా 'పీర్ల'కు సమర్పించే దిటవు లేకపోయింది. ప్రత్యామ్నాయంగా ఆవిడ ప్రతి సంవత్సరమూ ముస్లిం పండుగ అయిన 'మొహరమ్' రోజులలో కనీసం ఎనిమిదిరోజులు నన్ను ఫకీర్‌గా చేసేది ఆ ఎనిమిది రోజులూ ఆవిడ నన్ను వేలాడుతోన్న రంగురంగుల అంగరఖాలతో, ఫకీరు టోపీతో, చేతికర్రతో, భుజంమీదుగా వేళ్ళాడుతోన్న రంగుల సంచీతో, అసలైన ముస్లిం ఫకీర్‌లా తయారుచేసేది. ముఖానికి విభూతి పూసుకుని ఈ వేషంలో నేను ఉదయమే ఇల్లు వదిలి రోజంతా వీధుల్లోనూ, సందుల్లోనూ,

భిక్షాటన చేసేవాడిని. సాయంత్రానికి ఇల్లు చేరేవాడిని. నా పితామహి భిక్షాటన ద్వారా నేను సంపాదించిన ధాన్యమంతా అమ్మి ఆ ధనంతో 'పీర్ల'కు పూజాతంత్రాలతో నైవేద్యాలు సమర్పించేది.

కోరబడని శిశువు

ఫకీర్‌మోహన్ తండ్రి లక్ష్మణ్‌చరణ్ సేనాపతి మరణంతో, అతడి పెదతండ్రి పురుషోత్తమ్ ఒక్కడే కుటుంబానికి ఏకైకాధారం అయ్యాడు. అతడే మల్లవంశానికి పెద్ద. ఆ భార్యాభర్తలు రోగిష్ఠి తమ్ముడి కొడుకుని తమ సంపాదనతో సాకవలసి రావటం సహించలేకపోయారు. కనీసం అతడిపట్ల తమ తిరస్కారభావాన్ని దాచుకోవటానికి కూడా వారు ప్రయత్నించలేదు.

ఆ రకమైన వ్యతిరేక వాతావరణంలో పసివాడైన ఫకీర్‌మోహన్ విద్యాభ్యాసం సక్రమంగా సాగటం సాధ్యంకాలేదు. చాలాకాలంవరకూ జబ్బుపడిన కారణంగా తొమ్మిదేళ్ళు వచ్చేవరకూ అతడికి అక్షరాభ్యాసమైనా కాలేదు అదైనా పాతకాలపు ప్రాథమిక పాఠశాలలో చదువుకోవలసి వచ్చింది అక్కడ పంతులుగారి జీతంలో కొంత భాగాన్ని సేవలద్వారా చెల్లించవలసి వచ్చేది మిగిలిన పిల్లలంతా సంతోషంగా ఇళ్ళకు వెళ్ళిపోయినా, చిన్న ఫకీర్‌మోహన్ తా నొక్కడే ఉండిపోయి, పంతులుగారికి వంటలోనూ, మిగిలిన ఇంటిపనులలోనూ సహాయపడవలసివచ్చేది. ఇంతచేసినా పెదతండ్రి జాతిగుండె కరిగేదికాదు. తన పిల్లలలాగా ఇతర విద్యార్థులలాగా ఫకీర్‌మోహన్ పేము దెబ్బలు తినటంలేదని అతనికి కష్టంగా ఉండేది. అంచేత ఫకీర్‌మోహన్‌కై పంతులుగారి కియ్యవలసిన కొద్దిపాటి జీతాన్ని కూడా ఇయ్యకుండా–విద్యార్థి వీపుమీద దెబ్బలు తగలకపోతే చదువెలా అబ్బుతుందని వాదించేవాడు. తన జీతం రాబట్టుకోవటానికి పంతులుగారు అసూయాపరుడైన పెదతండ్రి తర్కానికి లొంగక తప్పలేదు. ఒకసారి, పెదతండ్రి పాఠశాలలో వున్న సమయంలో తగినంత కారణమేమీ లేకుండానే పంతులుగారు ఫకీర్‌మోహన్ వీపుమీద నిర్దాక్షిణ్యంగా డజనుదెబ్బలకు పైగా కొట్టారు. పాపం, ఆ పసివాడు తన ఏకైకాశ్రయమైన నాయనమ్మ వళ్ళో చేరి ఘొల్లుమన్నాడు. నిర్ఘాంతపోయిన వృద్ధురాలు ఇంట్లోనుండి పంతులుగారి దగ్గరకు పరుగెత్తి 'ఏమయ్యా! పంతులూ! చిన్నపిల్లలు నీకు లేరూ? పసివాణ్ణి నిష్కారణంగా ఇలా ఎలా చావబాదావయ్యా?' అని తిట్టిపోసింది.

కాని, హృదయంలేని పెదతండ్రినుండి తనకు రావలసిన జీతాన్ని రాబట్టుకోవటానికి పితామహి వ్యతిరిక్తతను లెక్కచెయ్యకుండా, పాపం, పంతులుగారు ఈ రకమైన విద్యాశిక్షణ అనేకసార్లు ప్రదర్శించవలసి వచ్చింది.

ఏది ఎలా వున్నా, పసివాడైన ఫకీర్‌మోహన్ విజ్ఞానతృష్ణకు తృప్తి అనేది లేదు సంకట పరిస్థితులను సరకుచెయ్యకుండా అతడు సాయంసమయాల్లో పట్టణంలోని మరో పంతులుగారిని ఆశ్రయించి పర్షియన్ భాషా జ్ఞానం సంపాదించాడు తరువాతి జీవితంలో ఈ భాషలో రచనాప్రావీణ్యాన్ని కూడా ప్రదర్శించగలిగాడు

తాము వదిలించుకోవా లనుకుంటూన్న తమ్ముడి కొడుకులో యీ మాత్రపు పాండితీ ప్రతిభనుకూడా అసూయాగ్రస్తులైన పెదతండ్రి దంపతులు సహించలేకపోయారు. అంచేత తమ పిల్లలను మాత్రం కిరస్తానీ మిషనరీలు నడిపే ఆధునిక పాఠశాలల్లో ప్రవేశపెట్టి ఫకీర్ మోహన్ విద్యాభ్యాసానికి ప్రారంభ దశలోనే స్వస్తి వాచకం పాడేసారు పదేళ్ళ పసిపాపడుగా వున్నప్పుడే బలాసోర్ రేవులో కూలివాడిగా ప్రవేశపెట్టారు.

# 3

# పాండిత్యాభిలాషియైన పని పిల్లవాడు

ఈనాడు హుగ్లీ నది ఒడ్డున కలకత్తా నగరం వెలసిన చోట ఒకప్పుడు 'జాబ్ చార్ నాక్' (Jobcharnock) గుడిసెలు లేపక ముందే బలాసోర్ దగ్గిర అభివృద్ధి చెందుతోన్న వర్తక కేంద్రం బ్రిటిష్ వారికుండేది. బలాసోర్ రేవు పట్టణం ఉచ్ఛదశ నందుతోన్న నాటి స్థితిగతులన్నీ అతడు తన ఆత్మకథలో చెప్పిన కథల వర్ణనలలో యీనాటికీ సజీవంగా నిలిచి వున్నాయి. పనిపిల్లవాడుగా ఆ రేవు స్థలాలన్నీ అతడు బాగా

తెలుసుకని ఉండటమే దీనికి కారణం. తమ ప్రాచీన సాగర తీర వైభవానికి గర్వించే ఒకియనులకు, కల్లోల సాగర సంక్షోభాన్నీ, ప్రళయ ప్రభంజన భీభత్సాన్నీ వాస్తవంగా చిత్రించే కథల నందించిన ఏకైక రచయిత ఇతడు. ఆయన బాల్యంలో కూలివాడిగా గడిపిన రోజులే యీ కథలకి ఆధారం. ఆయన తన ఆత్మకథలో ఓడ రేవులో చూచిన విషయాలను ఇలా చెప్పారు.

"నా చిన్నతనంలో బలాసోర్ చాలా సౌభాగ్యవంతమైన వర్తక కేంద్రం అయిదారు వందల నౌకలు నిత్యం వస్తూ పోతూ వుండేవి. అందులో చాలా ఓడలు ఒరిస్సా ఉప్పుని, కొన్ని మిగిలిన వస్తువుల్ని దూర తీర ప్రాంతాలైన రంగూన్, మెద్రాస్, కొలంబోలకి, హిందూ మహా సముద్రంలో వుండే ద్వీపాలకి మోసుకుపోతూ వుండేవి. ఆ రోజుల్లో ఓడలే వుండేవి. స్టీమర్ల గురించి యింకా వినని రోజులవి రకరకాల ఆకారాల్లో, వేర్వేరు కొలతల్లో ఓడని బట్టి ఆరు నుండి పన్నెండు దాకా తెరచాపలు అవసరమౌతూ వుండేవి. కొన్ని తెరచాపలు త్రికోణాకారంలోనూ, మరికొన్ని చతురస్రాకారంలోనూ, ఇంకా కొన్ని వంకర టింకరగానూ కూడా వుండేవి. ఈ తెరచాపలు పెద్దవయితే తుఫానులో ఓడ తలక్రిందు లయ్యే ప్రమాద ముండేది. చిన్నవైతే అసలు బయలుదేరలేకపోయేవి. ఈ విషయాలు సరిగ్గా తెలియని వాళ్ళు యీ కొలతల్లో తేలిగ్గా తప్పటడుగు వేసెయ్యొచ్చు"

"మా నాన్నగారూ, పెదనాన్నగారూ కూడా ఓడ గుత్తదారులుగానే జీవనోపాధిని సంపాదించుకున్నారు. సముద్ర వ్యాపారాలు సాధారణంగా తమ 'కేన్వాసు'లను గుత్తదారుల ద్వారానే సంపాదించేవారు. వాళ్ళు కుట్టు పనివారిని నియమించేవారు. నా చిన్నతనంలో వందలాది కుట్టుపనివాళ్ళు మా ఇంట తెరచాపలు తయారుచేస్తూ వుండేవారు. ఇది మంచి లాభదాయకమైన వ్యాపారం.

## ఉప్పునీటి వజ్రాలు :

కూలివాడిగా ఫకీర్ మోహన్ బలాసోర్ రేవుకి వెళ్ళే కాలానికి ఆ ప్రాచీన వైభవపు చివరి మెరుపులు మాత్రమే మిగిలాయి. ఈ రేవు అదృష్టం సన్నగిల్లిపోవటం చూసిన పెదనాన్న అతడిని ఉప్పుశాఖలో ప్రవేశపెట్టాడు.

పెద్దవాడైన తరువాత ఈ రేవు మూసివెయ్యటం వల్ల సకల సంపద లతో తులతూగే తన జన్మభూమి నికృష్టంగా మారిపోవటం తలుచుకుని పరి తాపాన్ని వ్యక్తం చేసాడు.

తన జీవిత చరిత్రలో ఆయ నిలా అంటారు. "భారతదేశంలోనే కాక యూరప్‌దేశ మంతటా కూడా బలాసోర్ నౌకాశ్రయంగానూ, వర్తకకేంద్రం గానూ పేరు పొందింది. డచ్, డానిష్, ఫ్రెంచ్, బ్రిటిష్ వ్యాపారస్థులు బెంగాలులో స్థిరపడే ముందు బలాసోర్‌లోనే వ్యాపార కేంద్రాలను తెరి చారు కానీ, అదృష్టం మారిపోతుంది. హెచ్చు తగ్గులు జీవిత ధర్మం దీనిని అక్షరాలా బలాసోర్ నిరూపిస్తోంది. ఒకప్పుడు వేలకొద్ది గుంపులతో సందడిగా వుండే నదీతీరం చివరకు స్మశాన స్థబ్దతలో అడవులతో కప్పబడి పోయింది. ఏ ఒక్కడూ దానిని చూడటానికి పోడు. ఇప్పుడా ఒడ్డుమీద బురదా ఇసుకా ఎత్తుగా పేరుకుపోయాయి బలాసోర్‌లోని వ్యాపారాన్నంతా ఎవరికో వదలేసి అక్కడి నౌకాధిపతుల ధనికవర్గం మాయమయిపోయింది."

బలాసోర్ ఓడరేవు నుండి బియ్యం, బట్టలూ కంటే, ఉప్పే విలువైన ఎగుమతిగా కనపడుతోంది. ఫకీర్ మోహన్ ఇలా అంటారు: 'బలాసోర్ అనుభవించిన వైభవమంతా ఉప్పువల్లే; బలాసోర్‌కి ఉత్తరంలో వున్న సువర్ణరేఖ దగ్గర నుండి దక్షిణంలో ధమ్రలోని మహానది దాకా ఆ తీరమంతా ఉప్పు విపరీతంగా తయారుచెయ్యబడేది. ఆ రోజులలో బెంగాలు గ్రామీణులకి బలాసోర్ ఉప్పుమాత్రమే తెలుసు. ఉప్పుమీద పన్ను విధించే ప్రభుత్వశాఖే బలాసోర్ ప్రజల ముఖ్య జీవనాధారమయింది.

## ప్రభుత్వం ఉప్పును సంపూర్ణంగా స్వాధీనం చేసుకొంది

కానీ, ఈ ఓడరేవు ఉప్పు ఎగుమతిని ఈమాత్రంగా కూడా అనుభ వించలేకపోయింది. ఫకీర్ మోహన్ విషాదంగా ఇలా అంటాడు: "ఉప్పు పరిశ్రమను నిషేధిస్తూ ప్రభుత్వం శాసనం చేయటం, ఆ శాఖలే తీసివేయటం- ఒక్క బలాసోర్‌కే కాక మొత్తం ఒరిస్సా కంతటికీ దురదృష్టాన్ని తెచ్చింది. ఒరిస్సా భాగ్యదేవత ఆ ప్రదేశాన్ని వదిలేసి లివర్‌పూల్ దగ్గిరా, ఇంగ్లాండ్ లోని ఇతర స్థలాలలోనూ స్థిరపడింది.

దేశభక్తుడైన ఫకీర్ మోహన్ తన గ్రామానికేకాక ఒరిస్సా కంతటికీ పట్టిన ఈ దురదృష్టాన్ని ఎన్నటికీ మరిచిపోలేకపోయాడు. ఆ తరువాత

1907 లో ఆయన 64-వ పేట బలాసోర్‌లోని ఒకప్పటి ఉప్పు పరిశ్రమను గూర్చిన విషాదవాస్తవాలను ప్రచురించాడు. అందులో దీనిని రద్దుచెయ్యటం వలన కలిగిన ఆర్థిక దుస్థితిని, కొనసాగించివుంటే సమకూరే సౌభాగ్యాన్ని ఎత్తిచూపాడు. మహాత్మా గాంధీ నాయకత్వంలో భారత స్వాతంత్ర్య సమరంలో ప్రాథమిక మానవహక్కులకు ఉప్పు చిహ్నం కావటానికి అర్థశతాబ్దికి పూర్వమే, భారతదేశంలో జాతీయ ఉప్పు పరిశ్రమ పునరుద్ధరణకు తానొక్కడే ఆందోళన లేవదీసాడు.

అతనిలా అంటాడు.

"మొదట మా దేశస్థులు (ఉప్పు మళ్ళు) మట్టినిచ్చి విదేశాలనుండి బంగారం తెచ్చుకునేవారు ఇప్పుడు వీళ్ళు పాశ్చాత్యుల పనికిమాలిన వస్తువులకై తమ బంగారాన్ని ధారపోస్తున్నారు. నేనింతకుముందు చెప్పినట్లు బలాసోర్ ఒక్కటే తొమ్మిది లక్షల మణుగుల ఉప్పును తయారుచేసేది. అది అలాగే కొనసాగి వుంటే, ఇప్పటికి కనీసం ఇరవై లక్షల మణుగులవరకు ఉత్పత్తి పెరిగివుండేది. అప్పుడది ఆ జిల్లాకి ఎక్కువగా కాకపోయినా కనీసం పదిలక్షల రూపాయిలను సంపాదించిపెట్టేది. ఒరియాలో ఓడమీద ఎక్కితిరిగే 'కైబర్తు'లకు నవీన నౌకా శాస్త్రీయపద్ధతులలో ప్రవేశం కలిగించివుంటే, ఈ ఉప్పు వర్తకం ఈనాడెంత లాభదాయకంగా వుండేది!

"ఈ రోజుల్లో బలాసోర్ భాగ్యవంతంగా కనబడుతోంది - అంతే! దాని బాహ్యాడంబరానికి వెనుక బయటివారి అదుపులో వున్న మన ఆర్థిక జీవితపు అవకతవకలన్నీ వున్నాయి. వ్యాపారస్థులేకాక, ప్రభుత్వ శాఖలలో వుండే అధికారులందరూ కూడా విదేశస్థులే! తమ దేశంలోనుండే వెళ్తోన్న 'రైల్వే'లో ఒరియనులు ఒక్క ఉద్యోగం సంపాదించడాన్ని గురించి కలలో కూడా ఊహించలేరు. వ్యవసాయం మాత్రమే ఒరియనుల ముఖ్యాధారంగా నిలిచింది. కానీ, అందరికీ సాగుచేసుకోవటానికి చాలినంత భూమి ఎక్కడిది? అయ్యో! భగవంతుడా! నువ్వా ప్రభుత్వ హృదయంలో ప్రవేశించి బలాసోర్‌లో ఉప్పు పరిశ్రమ ఎప్పటిలాగే కొనసాగేలాగ చూడలేవా?"

ఒక అవిరామ విజ్ఞానాన్వేషి

ఒక కొత్త శకాన్ని సృష్టించిన ఈ మార్పులన్నింటిమధ్యా ఎవరూ పట్టించుకోని మన చింకిబట్టల రోగిష్టి కూలిపిల్లవాడు నెమ్మదిగానైనా, నిబ్బ

రంతో తన కందిన ఆధారాలన్నింటినుండి విజ్ఞానం సంపాదించుకోసాగాడు. ఫకీర్ మోహన్‌ని ఉప్పు శాఖలో వాళ్ళ పెదనాన్న ప్రవేశపెట్టినప్పుడు, బెంగాలీ, పర్షియన్, సంస్కృతం, ఉపాధ్యాయుల దగ్గరనుండి నేర్చుకోవటానికి సమయం చిక్కేది. జ్ఞానతృష్ణ ఆయనలో జీవితాంతం నిలిచిపోయింది. ఇప్పటి ఆంధ్రప్రదేశ్ శ్రీకాకుళంలో వున్న టెక్కలిలో ఈయన కొన్నాళ్లు వుంటటం తటస్థించింది. అప్పుడాయనకు యాభైఏళ్ళకు పైగానే వున్నా, ఒక పండితుణ్ని నియమించుకొని కొంత ఆంధ్రభాషాజ్ఞానాన్ని సంపాదించుకున్నారు. సాహసోపేతమైన అతని సాహితీ ప్రయోగాలన్నీ ఇంగ్లీష్‌పై అతనికున్న అధికారానికి చిహ్నాలు కావచ్చును. ఆయనకు 23 ఏళ్ళు వచ్చేవరకూ ఒక్క అక్షరంకూడా రాదు. అప్పటికే ఆయన బలాసోర్ మిషనరీ పాఠశాలలో ప్రధాన పండితుడు. ఇంగ్లీషురాని దేశీయ పండితుడైనా, ఇతనికి పట్టణంలో గుర్తింపు వుండేది. ఇతని సహజ మేధాసంపత్తిని విదేశీయులు సహితం గౌరవించేవారు. కాని, ఒకసారి యూరోపియన్ అధికారి చీదరించుకోవటంవల్ల, తక్షణం రాజభాష అయిన ఇంగ్లీష్ నేర్చుకోవటం మొదలు పెట్టాడు. ఈ మేధావి తనంతతానుగా విజ్ఞానమార్గంలో ప్రవహించిపోవటానికి కొద్దిపాటి ప్రాథమిక శిక్షణమాత్రమే అవసరమయింది. పూర్తిగా స్వయంకృషితోనే ఒక్క నిఘంటువు సహాయంతో 'అరేబియన్ నైట్స్', 'రాబిన్‌సన్ క్రూసో', లాల్ బెహారీడే రచించిన 'బెంగాల్ పెజంట్ లైఫ్' 'ఇంగ్లీష్ బైబిలు' మొదలైనవి చదివానని ఆత్మకథలో చెప్పుకున్నాడు అతడు చదువుకొన్న ఇంగ్లీషంతా ఇంతమాత్రమే! స్వయంసాధనతో సంపాదించిన ఈ పరిమిత భాషాజ్ఞానమే అతణ్ని అటు ఉద్యోగ జీవితంలోనూ, ఇటు సాంఘిక జీవితంలోనూ ఉన్నతస్థానంలో నిలబెట్టింది.

## విద్యాభ్యాసంలో రెండవ వింత

బలాసోర్‌లోని ఉప్పు శాఖను ఎత్తివేసాక పదిహేనేళ్ళ పసివాడైన ఫకీర్ మోహన్‌ని గురించి పట్టించుకున్నవారే లేకపోయారు. అధికారుల్లో చాలామంది బెంగాలీవారు కావటంవల్ల ఇతర ప్రభుత్వశాఖల్లో ప్రవేశించటానికి బెంగాల్ వెళ్ళిపోయారు. ఆ ఊరివారిలో అసంఖ్యాకులు ఆఫీసులచుట్టూ కొన్నాళ్ళు తిరిగారు. నిరుద్యోగి ఫకీర్ మోహన్ కూడా ఆ దురదృష్టపు గుంపులో ఒకడు. కానీ ఈ పిచ్చితిరుగుడే అతనికొక వ్యక్తిత్వం ఏర్పడటానికి

సహాయం చేసింది. చివరికి అశ్రద్ధచేయబడ్డ అనాథబాలుడు తనకు తానుగానే ఒక నిశ్చయానికి వచ్చాడు. ఓ పద్ధతంటూ లేకుండా నేర్చుకున్న తన కొద్ది పాటి విజ్ఞానాన్ని సక్రమమైన మార్గంలో మరింత వృద్ధిచేసుకోవాలను కున్నాడు

బలాసోర్‌లోని ఒక పేటలోవున్న మిషనరీ పాఠశాలలో నాయ నమ్మకు కూడా చెప్పకుండానే ఫకీర్‌మోహన్ చేరిపోయాడు. అప్పటి కతడు అర్ధనగ్నంగా తిరుగుతూ వుండేవాడు. పై చొక్కా కూడా వుండేదికాదు. కానీ, ఆయన పెదనాన్న కొడుకు నిత్యానందమాత్రం ఖరీదైన సాటిన్ బట్టల్తో బడికివెళ్తూ వుండేవాడు అసూయ, అల్పత్వం, ఆ కుటుంబంలో విపరీతంగా పేరుకుపోయాయి. నిత్యానంద తన హరికేన్ లాంతరుదగ్గిర ఫకీర్‌మోహన్‌ని చదువుకోనిచ్చేవాడు కాడు

అలాంటి ప్రతికూలమైన పరిస్థితుల్లో కూడా చరిత్ర, భూగోళం, లెక్కలు మొట్టమొదటిసారి చూడగానే ఆయనకెంతో ఆనందాన్నిచ్చాయి. ఇది కీట్స్ చిన్నతనంలో మొదటిసారిగా 'చాప్‌మన్స్ హోమర్' చదివినట్లుగా వుంది. ఫకీర్‌మోహన్ మేధాశక్తికి, నిజాయితీకి, వినయానికి, ఉపాధ్యాయులు సంతోషించారు కానీ, దురదృష్టవంతుడైన ఈ యువక పండితుడు నెలకి పావలాకూడా బడిజీతంగా కట్టలేకపోయాడు. నెలనెలా బాకాయిపడేవాడు. నాయినమ్మ, ప్రధానోపాధ్యాయుల ఒత్తిడివల్ల పెదనాన్న ఒక సంవత్సరం అయిష్టంగా జీతం కట్టినా. రెండవ సంవత్సరం సహాయం చెయ్యటానికి మొండిగా నిరాకరించాడు ఆరు నెలల సంఘర్షణ తరువాత నిరాశానిస్పృహ లతో, ఫకీర్‌మోహన్ తన చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది.

### విద్యాభ్యాసపు పరిసమాప్తి

చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రవేశపెట్టిన ఈ మహానుభావుడు ఒకనాడు నెలకు పావలా డబ్బులు పోగుచెయ్యలేక ప్రాథమిక విద్యనయినా పూర్తి చెయ్యలేకపోవటం, అపహాస్యంగా కనబడుతుంది.

విజ్ఞాన తృష్ణగల ఈ యువపండితుని నిష్ఫలమైన ఆవేదన, అతని నెంతో ఆప్యాయంగా చూసే నాయనమ్మ దృష్టిని దాటిపోలేదు. "చదువు కోసం ఎందుకంత ఆరాటపడతావు బాబూ! కొంచెం ఆగు. నీ అంతట నువ్వే ఎంత డబ్బు సంపాదిస్తావో చూడు!" అన్నదే, ఆవిడ ఓదార్పు.

ఈ వృద్ధ విద్యావిహీన హృదయాంతరాళంలోని నిష్కల్మష ప్రేమను వర్షించిన దీవనలే త్వరలో నిజమయ్యాయి.

# 4

# ఉపాధ్యాయుడు - రచయిత - ప్రచురణకర్త

నెలకి పావలా జీతం కట్టలేక, బడినుండి తీసివేయబడ్డాక, పాపం, ఫకీర్‌మోహన్‌కి ఏంచెయ్యాలో తెలియలేదు. అసూయాగ్రస్తులు, దయారహితులు అయిన పెద్దమ్మా పెదనాన్నలతో కూడిన ఇల్లు అతనికి నరకంలా వుండేది.

అయితే, అంతటి దారుణమైన నిరాశలో అతడు ఎంతోకాలం వుండవలసిన అవసరం లేకపోయింది. త్వరలోనే అతడు చదువుకొన్న బడిలోనే ఉపాధ్యాయుడి ఉద్యోగం ఖాళీ అయింది. ఆ ఉద్యోగానికి కావలసిన విద్యార్హతలు లేకపోయినా, సహజంగా తెలివికలవాడయిన ఫకీర్‌మోహన్‌కంటె సరిఅయిన అభ్యర్థులు ఆ ప్రధానోపాధ్యాయుడికి కనపడలేదు. ఆ వెంటనే నెలకి రెండున్నర రూపాయిలకు ఉపాధ్యాయ వృత్తికి ఫకీర్‌మోహన్ ఆహ్వానింపబడ్డాడు. ఈనాడు ఆ జీతం హాస్యాస్పదంగా కనపడవచ్చు కాని, దానికే మనవడి ప్రయోజకత్వానికి అతని నాయనమ్మ పట్టరాని సంతోషంతో పరుగులు తీసింది.

## దేశభక్తుడైన ప్రచురణకర్త

ఫకీర్‌మోహన్ విద్యార్థులకు శిక్షణనిచ్చే పద్ధతిని బరబతి పాఠశాలాధికారులు మెచ్చుకుని అతడు కోరకుండానే జీతం రెండున్నర రూపాయలనుండి నాలుగు రూపాయలవరకూ పెంచారు. కొనుగోలుశక్తిలో ఒక పైస ఈనాటి రూపాయికంటె ఎక్కువైన ఆ కాలంలో అది గొప్పజీతమే.

యువ ఫకీర్‌మోహన్ మొదటినుండీ శక్తిమంతుడూ, సమర్థుడూ అయిన ఉపాధ్యాయుడే! ఉదాహరణకి భూగోళం చెప్పాలనుకుంటే, అందుకు కావలసిన దేశపటాలు తేలికగా దొరకకపోవటంవల్ల సొంతంగా తయారు చేసుకునేవాడు. ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించిన మూడవ ఏట అతడిని గణితశాస్త్రం బోధించమని అడిగారు. గణితము, బీజగణితము (algebra), త్రికోణ వస్తుపరిమాపక విద్య (trigonometry) అన్నీ సొంతంగా నేర్చుకున్నాడు. ఇవేవీ అతనికి బడిలో నేర్పలేదు. బలాసోర్‌లో బీజగణితము, త్రికోణ వస్తుపరిమాపక విద్య సరిగా నేర్పగలిగిన వారెవరూ లేరు. చరిత్ర, సాహిత్యం చాలా సమర్థంగా చెప్పగలిగేవాడని చెప్పకుండానే అర్థమవుతోంది.

ఈ విధంగా ఒకప్పటి కూలివాడు మంత్రించినట్లు మహా మేధావి అయిన ఉపాధ్యాయుడుగా మారిపోయాడు. ఏదో ఒక విషయానికి మాత్రమే ఉపాధ్యాయుడు కాడతడు లెక్కలు మొదలు సాహిత్యంవరకూ ఎంతో వైవిధ్యంవున్న విషయాలన్నీ బోధించగలడు

## అతని యూరోపియన్ మిత్రులు

ఉపాధ్యాయవృత్తిని సమర్థంగా నిర్వహించటంవల్ల అతనికి అంతులేని కీర్తి వచ్చింది. ఆ కారణంవల్ల బాధ్యతాయుతమైన ప్రధానోపాధ్యాయ పదవి బలాసోర్ క్రిస్టియన్ మిషన్ పాఠశాలలో ఖాళీ అయినప్పుడు మరో ఆలోచన లేకుండా యూరోపియన్ మిషన్ అధికారులు ఇతనిని నెలకు పదిరూపాయల జీతంతో తీసుకున్నారు. అప్పుడు బలాసోర్‌లో అదే గౌరవప్రదమైన సంస్థ.

ఈ మార్పే యువ ఫకీర్‌మోహన్ కీర్తి విదేశమంతా వ్యాపింపచేసింది. ఈ సందర్భంలోనే ఇతనికి యూరోపియన్ అధికారులతోనూ, మిషనరీలతోనూ సాన్నిహిత్యం పెరిగింది. వారిలో ముఖ్యులు పాఠశాల కార్యదర్శి ఇ. సి. బి. హాలమ్, కలెక్టర్ జాన్‌బీమ్స్. బ్రిటిష్‌వాడైన బీమ్స్ 'కంపేరిటివ్ గ్రామర్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్' వ్రాయటం ద్వారా భాషాశాస్త్రజ్ఞుడుగా చిరస్మరణీయుడయ్యాడు. అతడు పండితుడేకాక సమర్థుడైన నిర్వాహకుడు కూడ! ఇటీవల ప్రచురింపబడ్డ ఆయన ఆత్మకథ 'మెమరీస్ ఆఫ్ ఎ బెంగాల్ సివిలియన్'లో గత శతాబ్దపు భారతీయ సామాజిక వ్యవస్థలోని చీకటికోణాలెన్నో వెలుగులోకి వచ్చాయి.

బలాసోర్ రాగానే బీమ్స్ మొట్టమొదట ఒరియా నేర్చుకోవాలనుకున్నాడు. అతడు అంతకుముందే ఒరియాకు సోదరభాషలైన బెంగాలీ, హిందీ, అస్సామి నేర్చుకున్నాడు. ఒరియా వ్యాకరణాన్ని ఇతర సోదర భాషల వ్యాకరణాలతో పోల్చి పరిశీలన చెయ్యాలని అతని సంకల్పం. ఒరియా మాత్రమేకాక, బెంగాలీ, సంస్కృతం కూడా బాగావచ్చిన ఉపాధ్యాయుడికోసం బీమ్స్ చూస్తున్నప్పుడు, అంతటి అసాధారణ బాధ్యతకు ఫకీర్ మోహన్ మాత్రమే సరిఅయిన వ్యక్తి అని హాలమ్ శిఫారసు చేశాడు.

ఆసక్తిగల పాఠకుడు వారి మొదటి సమావేశాన్నీ ఆ తరువాతి ఫలితాలనూ, ఫకీర్‌మోహన్ సొంత మాటల్లో వినటమే మంచిది.

"భారతీయులలోనూ, బ్రిటిష్‌వారిలోనూ కూడా జాన్‌బీమ్స్ గొప్ప పండితుడిగా ప్రఖ్యాతి పొందాడు. పదకొండు భాషలపై అధికారం సంపాదించాడు. బలాసోర్‌లో వున్నప్పుడు 'కంపేరిటివ్ గ్రామర్ ఆఫ్ ది ఇండియన్ లాంగ్వేజెస్' పుస్తక రచనలో ఊపిరిసలపకుండా వున్నాడు మా కార్యదర్శి హాలమ్‌గారు కూడా సాహితీ విద్యార్థి కావటంవల్ల ఇద్దరిమధ్య ప్రగాఢస్నేహం ప్రబలింది. సమగ్ర భాషావ్యాకరణంకోసం బీమ్స్‌కి ఒరియా, బెంగాలీ, సంస్కృతాలు బాగా తెలిసిన పండితుడు కావలసివచ్చింది. ఎప్పుడూ నా బాగుకోరే హాలమ్‌గారు నన్ను తనతో తీసికెళ్ళి బీమ్స్‌కి పరిచయం చేసారు. మొదటి పరిచయంలోనే ఆయన నన్ను సంస్కృతంలో ప్రత్యయాలు, విభక్త్యర్థకమైన అవ్యయాలు గురించి ప్రశ్నించారు. నా సమాధానాలు ఆయనకు ఎంత నచ్చాయోగాని, ఆయన వెంటనే వాటిని తన 'కంపేరిటివ్ గ్రామర్'లో చేర్చుకున్నారు. ఈ ఒక్క సంఘటన బలాసోర్‌లో ఉండే యూరోపియనులలో భారతదేశపు పండితుడిగా నాకు పేరు తెచ్చింది.

బీమ్స్ నన్ను వారానికి ఒక్కసారయినా కలుసుకోమని కోరారు. ఆ సమావేశంకోసం ఇద్దరమూ ఎంతో ఆతృతతో ఎదురుచూసేవాళ్ళం ఎప్పుడైనా ఒకటిరెండు రోజులు ఆలస్యమయితే 'బాబూ! ఎందుకింత ఆలస్యం చేసారు?' అనేవారు. మా చర్చలన్నీ పూర్తిగా భాషాశాస్త్రాలకు సంబంధించినవే! క్లిష్టమైన సంస్కృత శ్లోకాలను వ్యాఖ్యానం చెప్పటంనుంచి, 'రసకల్లోల' అనే ఒరియా శాస్త్రీయ ప్రామాణిక గ్రంథంలోనూ, జనవ్యవహారం

లోనూ ఉన్న పాముమంత్రాలూ, మంత్రతంత్రాలూ వరకూ సాగుతూ ఉండేవి. బ్రిటిష్‌వారితో నాకున్న పరిచయం, వారికి నాపట్లగల అపరిమిత మైన గౌరవం – నా ఉద్యోగానికి ఎంతో సహకరించాయి. పెద్ద పెద్ద బెంగాలీ ఆఫీసర్లందరూ ఇప్పుడు నాతో సగౌరవంగా ప్రత్యేకత చూపుతూ తప్ప మాట్లాడరు. కలెక్టరాఫీస్‌లోని క్రింది శాఖలలో పనిచేసే చిన్న ఉద్యోగస్థుల సంగతి చెప్పనే అక్కర్లేదు

బలాసోర్‌లో స్త్రీ విద్యకూ ఒరియా భాషభివృద్ధికీ నేను సాయశక్తులా ప్రయత్నించినప్పుడు బీమ్స్ దగ్గిరనుండి అమోఘమైన సహాయం లభించింది. నా వ్యక్తిగత జీవితంలో కష్టాలు వచ్చినప్పుడూ, క్లిష్టపరిస్థితులు ఎదుర్కో వలసి వచ్చినప్పుడూ ఆయన నాకు అండగా ఉండి చేయూతనిచ్చేవారు–ఒక్క మాటలో చెప్పాలంటే, నా అభివృద్ధికి ఆధారం, ఆశయసిద్ధికి ఆలంబన ఆయనే! నాలౌకికాభివృద్ధి కంతటికీ వెనుక బ్రిటిష్‌వాడైన బీమ్స్ ఉన్నాడు. నేను చివరి ఊపిరి వదిలేవరకూ ఆయనను కృతజ్ఞతతో స్మరించుకుంటాను. ఈ నాటికీ ఆయన ఆత్మశాంతికోసం నేను ప్రతిదినమూ ఉభయసంధ్యలా భగ వంతుణ్ని ప్రార్థిస్తూ ఉంటాను. ఎంతో సంకోచంతో ఇక్కడ ఒక విషయం చెప్పుకొంటున్నాను. బీమ్స్ నన్నుగూర్చి తన స్నేహితులకు ''దేశభక్తుడైన పండితుడు'' అని చెప్పేవారు.

## కూలిపిల్లవాడు పుస్తకాలు వ్రాసాడు

బలాసోర్ మిషన్ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా పనిచేసే కాలంలో కొద్దిమంది విదేశీయులలోనే కాక, ఒరియా మాట్లాడే చుట్టుపక్కల తాలూకాలలోకూడా ఫకీర్ మోహన్ అప్పుడప్పుడే పైకివస్తోన్న దేశభక్తునిగా, రచయితగా, పండితునిగా ప్రసిద్ధిపొందాడు అతని సమర్థమైన శిక్షణలో పర్య వేక్షణలో ఆ పాఠశాల మంచి పేరు తెచ్చుకొంది. ప్రతిసంవత్సరమూ ప్రభుత్వ మిచ్చే 'స్కాలర్‌షిప్స్' లో అధిక భాగం ఆ పాఠశాల విద్యార్థులే పొందేవారు. అంతకంటె గొప్ప విషయం: పూర్తికాని ప్రాథమిక విద్య—కూలివాడుగా అనుభవాలు—ఇవి మాత్రమే అర్హతలుగాగల ఆ ప్రధానోపాధ్యాయుడు గణిత శాస్త్రము, చరిత్ర, 'జాగ్రఫీ', 'ట్రిగ్నామెట్రీ'—వీటిపై ఒరియాభాషలో తాను వ్రాసిన పాఠ్యగ్రంథాలకు ప్రశంసనీయమైన ప్రభుత్వ బహుమతులు గెలుచుకున్నాడు. తన తొలి ప్రయత్నంలోనే పుస్తక ప్రపంచంలో ఫకీర్

మోహన్ సాధించిన ఈ ఆశించని విజయంవల్ల అతని కీర్తి బలాసోర్ సరిహద్దుల నతిక్రమించి ఒరియా మాట్లాడే ప్రాంతాలన్నింటిలో వ్యాపించింది. తరువాతి కాలంలో ఆయన సాహితీ రచన లన్నింటిలోలాగానే, ఈ పాఠ్య గ్రంథాలలోనూ బహుముఖమైన కూలంకష పరిజ్ఞానమూ, విషయాలయొక్క అద్భుతమైన వాస్తవిక చిత్రీకరణ, చక్కని వ్యక్తీకరణ – కనిపిస్తాయి.

## అతడు తన భాషగురించీ, తనవారి గురించీ, ఆలోచిస్తాడు

ఫకీర్‌మోహన్ తన పుస్తకాలు సాధించిన విజయానికి తానే ఆశ్చర్య పోయాడు. ఒకటిన్నర సంవత్సరాల ప్రాథమికవిద్య మాత్రమే ఉన్న కూలి పిల్లవాడు తాను రచయిత కాగలనని ఊహించగలడా? కాని, ఉపాధ్యాయుడిగా అతని సామర్థ్యం, ఒక పెద్ద మనిషిగా, పండితునిగా – పాలకవర్గమైన బ్రిటిష్‌వారితో అతనికున్న పరిచయాలు, అనేక విషయాలమీద పుస్తకాలు వ్రాసిన రచయిత కావటం – ఆ పుస్తకాలు ఒరిస్సాలోని పాఠశాల లన్నింటిలోనూ పాఠ్యగ్రంథాలు కావటం – ఇవన్నీ రెండు పదులు దాటని లేతవయసులోనే, అతడు జాతిలో అగ్రగణ్యుడు కావటానికి కారణ మయ్యాయి. ధనార్జనకోసం పాటుపడవలసిన అవసరం తీరిపోగానే ఫకీర్ మోహన్ తనవారి దుస్థితి మెరుగుపరచాలని ఆలోచన సాగించాడు.

ఒరియనులను బాధించే ఆర్థిక వ్యావహారిక లోటుపాట్లు అలా ఉండగా, ఒరియాలో సరియైన పాఠ్యగ్రంథాలు లేవని బెంగాలీలుచేసే పరిహాసాన్ని ఫకీర్ మోహన్ ఎదుర్కోవలసి వచ్చేది. ప్రధానంగా జాతికి జరుగుతోన్న ఈ అవమానాన్ని తుడిచిపారెయ్యటానికే అతడు ఒరియాలో పాఠ్యగ్రంథాలు వ్రాయాలని సంకల్పించుకున్నాడు – భగవంతుని దయవల్ల యువకుడైన ఆ దేశభక్తుడు తన తొలి ప్రయత్నాలలోనే తాను ఆశించినదానికంటె ఘనవిజయాన్ని సాధించాడు. నిరాడంబరుడైన ఆ ఉపాధ్యాయుడు తన తొలి విజయాలతో ప్రోత్సాహితుడై ఒరియాభాషా సాహిత్యాలమీదకి తన దృష్టి మరలించాడు.

ఒక కూలిపిల్లవాడు కలలోకూడా ఊహించలేని విధంగా దేశనాయకుడిగా మారిపోవటాన్ని ఆయన మాటల్లోనే తెలుసుకుందాం:

"ఎప్పుడైనా ఒక కొత్త బెంగాలీ పుస్తకం కనబడితేచాలు,—నిరాశా నిస్పృహ-తో దాని పేజీలు లెక్కలేనన్నిసార్లు తిరగేస్తూ ఉండేవాణ్ని. నా మాతృభాష ఒరియాలో ఇలాంటి పుస్తకం ఎప్పటికి వస్తుందా, అని నన్ను నేను అనేకమార్లు ప్రశ్నించుకొనేవాడిని - నా గుండెలను చీల్చుకుని ఒక నిట్టూర్పు వెలువడేది. పర్షియన్, ఇంగ్లీష్ భాషలు వచ్చిన కొద్దిమంది ఒరియనులు ఒరియాలో మాట్లాడటం కూడా చిన్నతనంగా, తమ ఉద్యోగపు హోదాకు ఒక మచ్చగా, భావించేవారు. ఎంతో విలువైన వారిడబ్బు వారు చెత్త అనుకునే ఒరియా పుస్తకాలకై వృధాచేస్తారని ఆశించగలమా? అప్పటి నుండి, అభివృద్ధి చెందక అశ్రద్ధచేయబడ్డ నా మాతృభాషను ఎలా మెరుగు పరచాలన్నదే రాత్రింబగళ్ళు నాకు సమస్య అయిపోయింది. ఏ పని చేస్తున్నా నా అంతరాంతరాల్లో ఇదే కోరిక నన్ను నిరంతరమూ వేన్నాడేది - బెంగాలీలో వస్తున్నట్లుగానే, ఒరియాలోకూడా పుస్తకాలు వచ్చేలాగ చెయ్యాలన్నదే నా ఏకైక ధ్యేయం.

"కానీ, ఒరిస్సాలో రచయితలేరి? నేను రచయితను కాగలనా? ఒరియాలో మాస, వార, పత్రికలేవీ లేనందువల్ల నేను అప్పుడప్పుడు చిన్న చిన్న వ్యాసాలను బెంగాలీ "సోమ ప్రకాశ్" పత్రికకు పంపేవాడిని. సంపాదకుడు అవన్నీ ప్రచురించటంవల్ల ఏనాటికైనా రచయితను కాగలననే విశ్వాసం నాలో కలిగింది - ఈలోగా మా గ్రామంలో 'కృష్ణలీల' ఉత్సవాలకి కొన్ని పాటలు వ్రాయటానికి ప్రయత్నించాను. ఆ పాటలను బహిరంగ సభలలో పాడుతోంటే, నాకెంతో ప్రోత్సాహకరంగా ఉండేది.

"ఈసారి నేను గద్యరచనకు కొంత పెద్ద ప్రయత్నమే చేసాను. నా రచన పేరు "ఒక రాకుమారుని చరిత్ర", నా స్నేహితులు దానిని మెచ్చుకోబట్టి ఒరిస్సాకంతటికీ కటక్ దగ్గరున్న ఒకే ఒక మిషన్‌ప్రెస్‌కి దాన్ని పంపాను - కానీ, అది అచ్చుకావటానికి మూడువందల రూపాయలు అవుతుందనేసరికి, నాకెటూ తోచలేదు - ఆ నిస్పృహలో "ఒక రాకుమారుని చరిత్ర" పూర్తిగా మూలపడి మాయమయిపోయింది.

## ఉత్కళులు - ముద్రిత గ్రంథాలు

ఆ నాటి సామాన్య ఉత్కళుడు వివిధ రాగాలలో అనేక రీతులలో వచ్చే పద కవితద్వారానే సారస్వతాన్ని ఆనందించేవాడు. గద్యం

చదవటంకూడా అతనికి సాధ్యపడేదికాదు. కానీ, బాగా ప్రచారం పొందిన ఆ ప్రాచీన కవితలలోనయినా ఏ ఒక్కటీ అచ్చుకాలేదు. ఉత్కళులకు ముద్రిత రచనలను పరిచయం చెయ్యటానికీ, అవి వారికి అందుబాటులో ఉండేలా చూశటా . కీ, మొట్టమొదట ప్రసిద్ధ ఒరియా కవితలను, చౌకధరలో ముద్రించ టానికి – పూర్తిగా దీనికొరకే వినియోగపడే అచ్చుయంత్రం ఉండాలని మాలో కొందరము నిర్ణయించుకున్నాము – కటక్ "మిషన్‌ప్రెస్" దయా దాక్షిణ్యాలపై ఇకముందు ఆధారపడరాదని నిర్ణయించుకున్నాము."

సేనాపతి ముద్రణాలయము.

యువ ఉపాధ్యాయుడైన సేనాపతి ఒరిస్సాలోని బలాసోర్‌లో రెండవ ముద్రణాలయాన్ని నిర్మించటానికి పూనుకున్నాడు. అతని దగ్గర డబ్బులేదు. ఒక ఉమ్మడిసంస్థని స్థాపించి, సహకరించని వారిదగ్గిరనుండీ, మొండివారి దగ్గిరనుండీకూడా చందాలు వసూలుచెయ్యటం ప్రారంభించాడు. సాహ సంతో అతడు తలపెట్టిన ఈ ప్రణాళిక అతని సూక్ష్మబుద్ధికి చిరస్మరణీయ మైన చిహ్నంగా నిలిచిపోయింది. సహకారపద్ధతిమీద బలాసోర్‌వద్ద ముద్ర ణాలయాన్ని స్థాపించటం ఒక్కటే ఆధునిక ఒరిస్సాలో అతని నామాన్ని అమరంచేసి ఉండేదని, కవి రాధానాథ్ చేసిన బహిరంగ ప్రకటన ఎంతో సముచితమైనది.

సేనాపతి ముద్రణాలయానికి పరికరాలను ఎద్దుబండ్లలో కలకత్తా నుండి బలాసోర్ చేరవేయటానికి ఇరవైరెండు రోజులు పట్టింది. 'సేనాపతి ముద్రణాద్భుతం' పట్టపగలు ప్రారంభింపబడబోతోందని ప్రకటించిన రోజు బలాసోర్ కంతటికీ ప్రత్యేకించి గుర్తుంచుకోదగిన రోజు. ఈ అద్భుతాన్ని కళ్ళారా చూడటానికి గుమస్తాలందరూ సామూహికంగా సెలవుతీసుకోవ టంతో కలెక్టరాఫీసు పూర్తిగా ఖాళీ అయిపోయింది. తరువాత చాలా నెలల వరకూ దూరగ్రామాలలోని ధనికులు కేవలం ముద్రణయంత్రం ఎలా పని చేస్తోందో చూడటానికి పల్లకులలో బలాసోర్‌కి వచ్చేవారు. ఆరు నెలలపాటు ముద్రణయంత్రం సమర్థంగా పనిచేసిన తరువాత, జాన్‌బీమ్స్, ఒరిస్సా విభా గానికి 'కమిషనర్' అయిన టి. యి. రావేన్‌షా వంటి గౌరవనీయులంతా ఆ ముద్రణాలయాన్ని చూడటానికి వచ్చారు. వారంతా ఇలా రావటం –

వెస్ట్ మినిస్టర్‌లో విలియమ్ కాక్స్టన్ ఇలాంటి సాహస ప్రయోగమే చేసినప్పుడు బ్రిటిష్ రాజదంపతులు వచ్చిచూసినట్లుగా ఉంది సేనాపతి అనుభవాలు విన్న రావేన్‌షా సేనాపతిని పదిరూపాయల బహుమానంతో సత్కరించారు. అది తరువాత అతని పెట్టుబడి భాగంగా అయింది – కంపెనీ ఎత్తివేసినపుడు అతని భాగంతో లాభాలను కలిపి, రావేన్‌షాకి ముప్పయి రూపాయలను తిరిగి ఇచ్చేసాడు.

## పత్రికా సంపాదకుడు

యువ ఫకీర్‌మోహన్ శక్త్యుత్సాహాలను చూస్తోంటే, 'బెంజమిన్ ఫ్రాంక్లిన్' గుర్తురాకమానడు. ముద్రణాలయాన్ని సమర్థంగా నడపటంతో కాని, – ఉపాధ్యాయుడిగా – ప్రధానోపాధ్యాయుడిగా – అతడి కృషికి తగినట్లుగా వచ్చిన పేరు ప్రఖ్యాతులతోకాని, పుస్తకాలు వ్రాయటంతోకాని, అతడు తృప్తిపడలేక "బోధదాయిని" "బలాసోర్ సంబంధ వాహిక" అనే రెండు పత్రికలనుకూడా ప్రారంభించాడు. రెండవది వార్తలనూ విశేషాలనూ ప్రచురించేది. మొదటిది సాహితీ ప్రచురణలకు మాత్రమే పరిమితమైనది. వీటిని వ్రాసేవాడు, అచ్చువేసి ప్రచురించి పంపిణీచేసేవాడూ, ఆర్థిక స్థితిగతులను చూసుకునేవాడూ – అన్నీ అతడొక్కడే!

# 5

# అతని జాతీయ భాషా సంరక్షణ

బెంగాల్ నుండి ఒక బెంగాలీ పండితుడు బలాసోర్‌లో కొత్తగా స్థాపించిన ప్రభుత్వోన్నత పాఠశాలకు వచ్చాడు. అతడు ఒక గ్రంథాన్ని తీసుకువచ్చి దానిద్వారా ఒరియా స్వతంత్రభాషకాదనీ, బెంగాలీ భాషకి

రూపాంతరమేననీ వాదిస్తూ వెంటనే ఒరిస్సా అంతటా ఒరియాని తొలగించి బెంగాలీభాషని ప్రవేశపెట్టాలని నివేదించుకున్నాడు.

ఈ పరిస్థితుల్లో తన భాష, తన ప్రజలు ఎదుర్కొన్న విపత్కర పరిస్థితిని ఫకీర్ మోహన్ గుండెలు చెదిరే విషాదమయ వాక్యాలలో ఇలా వర్ణిస్తాడు: "బలాసోర్ జిల్లా పాఠశాల బెంగాలీ ప్రధానోపాధ్యాయుడు ఈ పుస్తకాన్ని బలాసోర్ పాఠశాలల "డెప్యూటీ ఇన్స్పెక్టర్" ద్వారా పాఠశాలల 'ఇన్స్పెక్టర్' దగ్గరకి పంపించాడు. ఇద్దరూ పండిత కాంతి చంద్రభట్టాచార్యుని సిద్ధాంతాన్నే సమర్థించారు. ఆ కాలంలో ఒరిస్సా అంతా మిడ్నపూర్‌లో ప్రధాన కార్యాలయం ఉన్న విద్యాసంస్థలోని ఒక భాగమే! అప్పటి పాఠశాలల "ఇన్స్పెక్టర్" ఆర్. యల్. మార్టిన్ ఇంగ్లీషువాడే అయినా, అతనిక్రింద పనిచేసే ఉద్యోగులు మాత్రం బెంగాలీవారే! త్వరలోనే మిడ్నపూర్‌లోని పాఠశాలల "ఇన్స్పెక్టర్" నుండి బలాసోర్‌లోని ప్రభుత్వోన్నత పాఠశాలలో బెంగాలీ, సంస్కృతాలేతప్ప ఒరియా ఉండరాదని ఆజ్ఞలు జారీ చేయబడ్డాయి.

## సేనాపతి ఈ దెబ్బను తిప్పికొట్టాడు

"బలాసోర్‌లో ఉన్న కొద్దిపాటి విద్యావంతులము ఈ పిడుగుపాటుకు నిర్ఘాంతపోయాము. మనకేమయింది? ఇప్పుడేం చెయ్యాలి? మనదేశంలో మన భాషను మనం చదువుకోలేమా?" అని మాలో మేము మథన పడ్డాము.

నా పాత మిత్రబృందం నా హెచ్చరికనందుకుంది. రాత్రింబగళ్ళు మా మాతృభాషను సంరక్షించుకునే మార్గాలను అన్వేషిస్తూ మా తలలు వేడెక్కించుకున్నాం! కానీ, ఆశాభంగమే ఎదురైంది.

మేము చిన్న తరగతి ఒరియను అధికారులను సమావేశపరచి ఈ విషయంలో తగిన చర్య తీసుకోమని కోరితే వారంతా ఏకగ్రీవంగా "మాడండి! ఇది పూర్తిగా ప్రభుత్వానికి సంబంధించిన విషయం. ప్రభుత్వం వేటిని చదవమంటే మన పిల్లలు వాటివి చదువుతారు. ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రవర్తించి కష్టాలను కొనితెచ్చుకుందామా?"

"ఈ అధికారుల మాటలు విని ఒరియను జమిందారులు, ధనవంతులు మామాట వినటం మానేసారు. పైగా "మహా మహా అధికారులే ఈ విష యంలో జోక్యం చేసుకోవటానికి ధైర్యం చెయ్యటంలేదు. అలాంటి విషయాల్లో మమ్మల్ని తలదూర్చి, ప్రభుత్వం విధించే శిక్షల్ని అనుభవించ మంటారా?" అనేవారు.

ఇలాంటి చేదు అనుభవాలు ఎదురౌతున్నా, చిన్నవాడైనా గుండె దిటవుగల మిషన్ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఎన్నోవిధాలుగా ప్రయత్ని స్తూనే ఉన్నాడు. మరోసారి అతడు ఒరియా ఉద్యోగులనందరనూ సమావేశ పరచి, వారిని బాధించే వారి ఆర్థికస్థితిని తట్టిచూపేలాగ – తెలివిగా – ఘాటుగా – ఇలా ఉపన్యసించాడు.

"ప్రియ మిత్రులారా! ఒరియాకి బదులుగా బెంగాలీ ప్రవేశపెట్టడం ప్రభుత్వ నిర్ణయం కాదని తెలుసుకోండి – ఇది పూర్తిగా బెంగాలీల కుట్ర. పాఠశాలల "బ్రిటిష్ ఇన్స్పెక్టర్"ని బుట్టలో వేసుకుని వాళ్ళిది సాధించారు. పాఠశాలలో సాధించిన విజయంతో మరింత పెట్రేగిన్న వాళ్ళు త్వరలోనే స్వ్యాయస్థానాలనుండీ, కార్యాలయాలనుండీ కూడా ఒరియాను తొలగిస్తారు. ఈ రకమైన చర్యలకు మూలకారణం ఏమిటో మీరు గ్రహించలేదా? వెనుకటి అధికారభాష అయిన పర్షియన్ మీ కందరికీ వచ్చును. కానీ, ఇంగ్లీష్ వచ్చిన కొందరు బెంగాలీ అధికారులకోసం పర్షియన్ భాష తొలగించబడింది. ఆ విధంగా వాళ్లు ఒరిస్సాలో ఉన్నత ప్రభుత్వోద్యోగాలన్నీ ఆక్రమించుకో గలి గారు. మీరు చిన్నప్పుడు ఎంతో కష్టపడి నేర్చుకున్న పర్షియను ఇప్పు డెందుకూ పనికిరాకుండా పోయింది. ఇకముందు ఒరియా తొలగింపబడి దానికి బదులుగా బెంగాలీ ప్రవేశపెట్టబడితే, ఒరిస్సాలో ఉండే ఉద్యోగాలన్నీ తరతరాలకూ, బెంగాలీలకే దక్కుతాయి. ఇక త్వరలోనే కలకత్తానుండి వచ్చే బెంగాలీలకొరకు మిమ్మల్నందరినీ సామూహికంగా తొలగించవచ్చు. మీ పిల్లల – మనవల భవిష్యత్తంతా గాఢాంధకారం తప్ప మరేంలేదు."

ఫకీర్మోహన్ ఇలా వ్రాస్తాడు · "నా ఈ కొద్దిమాటలు తక్షణమే సమావేశంలో అలజడిని లేవదీసాయి. వారంతా ముక్తకంఠంతో "వీల్లేదు – అలా జరగడానికి వీల్లేదు – మన పిల్లలు పాఠశాలలలో ఒరియా చదివితీరవల సిందే! ఏం చెయ్యాలో చెప్పండి! అందరం వెంటనే చేసేస్తాం!" అన్నారు.

"ప్రభుత్వానికి అర్జీ పెట్టుకోవటమె సులభమైన మార్గం. అందువల్ల నిశ్చయంగా ఒరియా తిరిగి పాఠశాలలో ప్రవేశ పెట్టబడుతుంది. అప్పుడు భవిష్యత్తులో ఉద్యోగాలన్నీ బెంగాలీలకే దక్కే ప్రమాదం తప్పిపోతుంది" – అని సమాధానం చెప్పాను. "తక్షణమే అర్జీ తయారు చెయ్యండి." అని అరిచారు, అందరూ.

"జాగ్రత్తగా ఒక అర్జీ తయారు చేసాము. అందరి సంతకాలూ సేకరించాము. దానిని జిల్లా 'కలెక్టరు'కు సమర్పించాం. ఒరియనుల అదృష్టంవల్ల అప్పటి బ్రిటిష్ అధికారులూ, ఆంగ్ల క్రిష్టియన్ మిషనరీలు మాకు అనుకూలంగా ఉన్నారు. ఇప్పుడు వారంతా మా ప్రతిఘటనను బలపరిచారు. ఈ సామూహిక అర్జీ భాషా శాస్త్రవేత్త, బలాసోర్ జిల్లా మేజిస్ట్రేటు అయిన జాన్‌బీమ్స్ దగ్గరకు వచ్చినపుడు, ఆయన దానిని ఒరిస్సా విభాగానికి కమిషనర్ అయిన టి. యి. రావెన్‌షా దగ్గరకు గట్టి సిఫారసుతో పంపాడు.

"ఒరియాభాష స్వతంత్రతనూ, ప్రాచీనతనూ రుజువుచేస్తూ ఒక కరపత్రాన్ని కూడా బీమ్స్ ప్రచురించాడు. దానిలో ఒరియాభాష సక్రమాభివృద్ధికి తీసుకోవలసిన సముచిత చర్యలను ప్రతిపాదించాడు. తన సిఫారసును బలపరచటానికి దాని ప్రతినొకదానిని బెంగాలు ప్రభుత్వానికి పంపించాడు

"ఒరిస్సాకు, ఒరియనులకు, శ్రేయోభిలాషి అయిన టి. యి. రావెన్‌షా ఒరియాకి అనుకూలంగా ప్రభుత్వానికి ఒక లేఖ పంపాడు. వెంటనే ఒరిస్సా పాఠశాలలనుండి బెంగాలీభాషని రద్దుచేయవలసిందనేకాక, ఒరిస్సా అంతటా ఒరియా భాషాభివృద్ధికోసం కొత్త పాఠశాలలు స్థాపించవలసినదిగాకూడా ప్రభుత్వంనుండి ఆజ్ఞలు వచ్చాయి.

"అందువల్ల ఒరిస్సా ఉదాత్తులైన బ్రిటిష్ వారిద్దరినీ జిల్లా మేజిస్ట్రేట్ బీమ్స్‌నీ, – కమిషనర్ రావెన్‌షాను, కృతజ్ఞతతో చిరకాలం గుర్తుంచుకోవాలి!"

# 6

# చతురుడైన నిర్వాహకుడు

బలాసోర్ దగ్గిర ఒక దశాబ్దానికి పైగా సమర్థంగా ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించాక యువకుడైన ఫకీర్ మోహన్ ఉపాధ్యాయ వృత్తిలోనే జీవితాంతం ఉండిపోవాలనే నిర్ణయానికి ఇంచుమించుగా వచ్చేసాడు కానీ, అప్పటివరకూ ఆయన ప్రభుత్వ యాజమాన్యంలేని ప్రత్యేక విద్యాసంస్థలలోనే పనిచేసాడు. ప్రభుత్వ విద్యాశాఖలో నిశ్చయంగా జీతము, భద్రత, పై మెట్టుకు ఎక్కే అవకాశాలు అన్నీ ఎక్కువగా ఉంటాయి. అనుకోకుండా ఒకసారి ఈ అవకాశం మన యువ ఉపాధ్యాయుడి గుమ్మంలో కొచ్చింది. కటక్‌లోని నార్మల్ (టీచర్స్ ట్రెయినింగ్) పాఠశాలలో ద్వితీయశ్రేణి పండితుని పదవి ఖాళీ అయింది. ఆ పాఠశాల ఒరిస్సా విజ్ఞాన వ్యవహారాలకు ప్రధాన కార్యాలయం. పాఠశాలల ఇన్స్‌పెక్టరయిన శ్రీ ఆర్. యల్. మార్టిన్‌గారు అప్పటికే ప్రసిద్ధుడయిన బలాసోర్ మిషన్ పాఠశాల ప్రధానోపాధ్యాయుణ్ని ఆ పదవికి ఆహ్వానించారు. మిగిలిన సదుపాయాలమాట అలా ఉంచి కేవలం జీతమే అప్పటి సేనాపతి జీతానికి మూడు రెట్లుండి ప్రలోభపరిచింది. సహజంగానే, ఆయన కటక్‌లోని ఆ ఉద్యోగాన్ని అంగీకరించటానికే నిశ్చయించుకున్నాడు కానీ అతడు ఈ విషయాన్ని గౌరవనీయుడైన యి. సి. బి. హాలమ్‌తో ప్రస్తావించగానే అతడు సేనాపతి జీతాన్ని కటక్‌లోని కొత్త ఉద్యోగాన్నుండి ఎంత ఆశిస్తున్నాడో అంతగా పెంచి అతడే అభివృద్ధిచేసిన పాఠశాల వదిలి వెళ్ళవద్దని అభ్యర్థించాడు. అంచేత ఫకీర్ మోహన్ తానున్న చోటనే ఉండిపోయాడు.

## బీమ్స్ అందించిన అవకాశం

అతని పొరపాటు ఏమీ లేకనే, ప్రభుత్వోద్యోగంలో చేరే అవకాశం తప్పిపోయినా, భాగ్యదేవత అతనికి మరిన్ని కొత్త అవకాశాలు కల్పిం

చింది - యాంత్రికమైన ఉపాధ్యాయ వృత్తిలో ఇంతటి మహదవకాశం అతనికి లభించి ఉండేది కాదు.

ఇరవై అయిదు సంవత్సరాల క్రిందటి వరకూ ఒరిస్సా రాజులదీ, మహారాజులదీ, జమిందారులదే! బలాసోర్ పక్కన ఉన్న నీలగిరి ఒక చిన్న సంస్థానం. అది భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, రాచరికం రద్దుచేయబడి బలాసోర్‌లో కలిపివేయబడింది. ఆ సంస్థానానికి కొత్త దివాను కావలసి వచ్చినప్పుడు శ్రీ జాన్ బీమ్స్ ఆ ఉద్యోగానికి యువ ఫకీర్ మోహన్‌ను ఆహ్వానించారు. ఉపాధ్యాయుడిగా-ముద్రణాలయ స్థాపకుడిగా-అతడు స్థానిక బ్రిటిష్ అధికారుల మనసులలో వేసిన చెరగని ముద్ర కిది తార్కాణం కావచ్చును. ఏ మాత్రమూ సంకోచించకుండా అతడు బీమ్స్ ఇచ్చిన ఉద్యోగాన్ని అంగీకరించాడు. ఈనాడైనా, ఎవరు మాత్రం అలాంటి అవకాశాన్ని వదులుకోగలరు ?

1871 లో తన ఇరవై ఎనిమిదవయేట ఫకీర్‌మోహన్ నీలగిరి సంస్థానంలో దివానుగా ప్రవేశించాడు. అప్పటినుండీ అతడు దివానుగానో, అసిస్టెంట్ దివానుగానో, మానేజరుగానో, అసిస్టెంట్ మానేజరుగానో, దోమ్పాడా (Dompada), ఢేన్‌కనల్ (Dhenkanal) , దాస్‌పల్లా (Daspalla), పాల్-లహడా (Pal-Lahada), కియోంఝ్‌హర్ (Keonjhar), కేంద్రపారా (Kendra Para) వంటి ఒరిస్సాలోని వివిధ రాష్ట్రాలలోనూ, జమీందారీల లోనూ పనిచేసాడు. పరిపాలనా రంగంలో పాతికేళ్ళకు పైగా ఎన్నోరకాల అనుభవాలు గడించాక, 1892 లో ఉద్యోగ విరమణ కావించాడు. ఈ ఉద్యోగాలవల్లనే అతడు స్త్రీలనూ, పురుషులనూ—వారి సంబంధ బాంధవ్యాలనూ, కష్టనిష్ఠూరాలనూ పరిశీలించ గలిగాడు. ఈ రకమైన అవకాశం అతనికి ఉపాధ్యాయ వృత్తిలో ఎన్నటికీ కలిగేది కాదు. ఈ పరిశీలనలే తరువాత ఫకీర్‌మోహన్ కథలలోనూ, నవలలలోనూ ప్రతిఫలించి అవి సజీవంగా స్పందించేలా చేసాయి. జాన్ బీమ్స్ దివాన్ గిరి ఈయకపోయినట్లయితే, సేనాపతి ఒరియాకోసం పాటుపడే సామాన్యుడిగా ఒక జిల్లాలో పడి ఉండేవాడు. ఒరియా వాఙ్మయం ఈ మహాపురుషుని కలం నుండి వెలువడిన అనన్య సామాన్యమైన రచనలను పొందగలిగేది కాదు.

ఫకీర్ మోహన్‌గా దివాన్‌గాగాని, మేనేజర్‌గాగానీ, ఎక్కడికి వెళితే అక్కడ కొత్త మార్పులు ప్రవేశపెట్టడానికి ప్రయత్నించేవాడు. దాదాపు ఒక శతాబ్దం వెనుకటి కాలంలోనే ఈ యువ దివాను ఒరిస్సాలోని నీలగిరి సంస్థానంలో తేయాకును వ్యాపార సరళిలో పెంచాలనే ఆలోచన చేయటం చాలా మంది పాఠకులను ఆశ్చర్యపరచవచ్చు. ఇతడే మొదటిసారిగా సరియైన బజారు ఏర్పాటు చేసాడు – సంస్కృత పాఠశాల స్థాపించాడు – ఇంగ్లీషు పద్ధతిలో పాఠశాలలను ప్రవేశ పెట్టాడు – నీలగిరిని బయటి ప్రపంచంతో కలుపుతూ రోడ్లు వేయించాడు. విరివిగా కొబ్బరి తోటలను పెంచాడు. అతడు ఎక్కడ ఉద్యోగం చేసినా, అక్కడ సొంతంగా ఒక చక్కని తోట పెంచేవాడు. విదేశాలలో పెరిగే పువ్వులనూ, కాయగూరలనూ, తన తోటలో పెంచి స్థానిక ప్రజలకు వాటిని తెలియబరిచేవాడు. అతనికి తన తోటలో ఎక్కడెక్కడినుండో తెచ్చివేసిన గులాబీలంటే, మిగిలిన అన్నింటికంటె ఎక్కువ ఇష్టం – జపాన్ నుండి ఇండియాకి కొత్తగా తెప్పించిన 'హుస్నహేనా' (Husnahena) పువ్వుల సుకుమార సుమధుర సువాసనలకు అతడు అపరిమితంగా ఆనందించేవాడు. సముద్రాలు దాటి వచ్చిన ఈ అత్యద్భుత సౌందర్యాలను స్తుతిస్తూ కవిత కూడా వ్రాసాడు. ఒరిస్సా గ్రామస్థులు మొట్టమొదటిసారిగా, కాబేజీ, కాలిఫ్లవర్ వంటి విదేశీ కాయగూరలు తెలుసుకున్న వృత్తాంతం అతడు వ్రాసిపెట్టుకున్నాడు. దాస్‌పల్లా (Daspalla) లో ఇతడు తన తోటలోని కాబేజీలను గ్రామపెద్దలకిచ్చాడు. తరువాత ఆ గ్రామ పెద్దలను కలుసుకున్నప్పుడు తాను బహూకరించిన కాయగూరలు ఎలా ఉన్నాయని అడిగాడు. వారంతా ఏకకంఠంతో "హుజూర్! మా ఆడవాళ్లు ఈ వింత పదార్థాన్ని మరుగుతోన్న వుల్లటి 'కంజి18 (Kanji) లో వేసి బాగానే ఉడకపెట్టారు. కానీ అది దాని ఆకారాన్నికాని, కంపునికాని వదిలిపెట్టలేదు సుమండీ!" అన్నారు.

సేనాపతి స్వీయచరిత్రలో అధికభాగం దివాన్‌గానూ, మేనేజర్‌గానూ తాను అనుభవించిన ఉత్తేజకరమైన అనుభవాలతో నిండి ఉంది. అనుకరణ సాధ్యంకాని సరళ సుందరమైన భాషలో సాగిందీవర్ణన. రంధ్రాన్వేషణ పరులయిన కొందరు ఈ వర్ణనలను నిరాధారమయిన బడాయి మాటలుగా కొట్టి

పొరెయ్యవచ్చును. కానీ నిష్పక్షపాతి అయిన ఒక బ్రిటిష్ అధికారి అతని పరిపాలనాదక్షతకు ఇచ్చిన యోగ్యతా పత్రమిది.

ఒరిస్సా విభాగానికి కమిషనర్ అయిన టి. ఇ. రావెన్‌షా 1873 వ సంవత్సరంలో బెంగాల్ ప్రభుత్వపు కార్యదర్శికి తన వార్షిక నివేదికలో ఇలా తెలియజేశాడు.

"బలాసోర్‌లోని మిషన్ పాఠశాల ఒరియన్‌లలోకెల్లా గొప్పవాడైన బాబూ ఫకీర్ మోహన్ సేనాపతిచేత నిర్వహింపబడింది. నీలగిరి రాజుదగ్గిర దివానుగా అంతకంటే మంచి ఉద్యోగం రావడంవల్ల ఆ ఉద్యోగాన్ని వదిలి పెట్టాడు. దివానుగా పనిచేస్తున్నప్పుడు నీతి నిజాయితీలు వ్యాపింపచేస్తూ అతడు ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించాడు. ఆ మహానుభావుడు పరోక్షంగా చేసిన ఎన్నో మంచిపనులకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే! అతని ఎడబాటు మనకు తీరని వెలితి."

## తెలియకనే పొందిన మాచియవెలీ (Machiaveli) శిష్యరికం

ఒకసారి సింహావలోకనం చేసుకుంటే, మాచియవెలీ తన "ప్రిన్స్" (Prince) లో పాలకులకు ఏమేమి బోధించాడో అవన్నీ ఫకీర్ మోహన్ తన కేమీ తెలియకుండానే ఆచరణలో పెట్టాడు. ఒక వంక క్రూరంగా అణచి వేయబడ్డ ప్రాంతాన్ని అభివృద్ధిలోకి తేవటంలో తండ్రిలాగానూ, మరొక వంక పరిపాలనలో చిక్కుసమస్యలను పరిష్కరించటానికి, దయాదాక్షిణ్యాలు లేక శాసించే కర్కోటకుడుగానూ, రెండు విధాలుగా కూడా, అతడు తెలివైన సిద్ధాంతాలను ప్రతిపాదించిన మహామేధావి అయిన ఆ ఇటాలియన్ రాజకీయ వేత్తనే అనుసరించాడు. తన వ్యక్తిత్వంలో 'మాచియవేలియన్' అనిపించే ఈ అంశాన్ని దాచుకోవాలనే ప్రయత్నమేదీ సమర్థుడైన ఈ పాలకుడు చెయ్యలేదు.

గాంధీగారు సహాయ నిరాకరణను ప్రపంచ ప్రసిద్ధం చెయ్యటానికి ఎంతో ముందుగానే అది ఒరిస్సా అంతటా సాంఘిక రాజకీయ చైతన్యంగా ఉండేది. ఇప్పటికీ అనాగరక ప్రాచీన పరిస్థితులున్న మారుమూల పల్లె టూళ్ళలో ఈ సహాయ నిరాకరణ ఉంది. ఈ ఇరవయ్యవ శతాబ్దిలో సామూహిక గాంధీయ ఉద్యమకారులను సర్వసమర్థులయిన బ్రిటిష్ రాజకీయ

వాదులు అణచివేసినట్లుగానే, దగ్గర దగ్గర ఒక శతాబ్ది వెనుక ఫకీర్ మోహన్ ఒరిస్సా రైతు సమూహపు సహాయ నిరాకరణను - లేదా మౌన తిరస్కారాన్ని అణచివేయగలిగాడు

## దోమపాడా సమస్యలు

ఇప్పుడు కటక్‌లో చేరిపోయిన దోమ్‌పాడా ఒకప్పుడు చిన్న జమీ. ఫకీర్ మోహన్ దివానుగా అక్కడికి వెళ్ళినప్పుడు అక్కడ కలకత్తాలో చదువుకున్న ఒక కొత్త "రాజా" ఉన్నాడు. ఈ యువక మహారాజుకు ఏ విధమయిన ఆనందోత్సాహాలూ లేని తన జమీ అడవి జీవితం కంటె సుఖప్రదమైన పట్టణ జీవితమే నచ్చింది ఆ కారణంచేత అతడు తన తాత ముత్తాతలనాటి రాజభవనాన్ని, గ్రామ ప్రజలను మాత్రమేకాక, రాణిని కూడా నిర్లక్ష్యంచేసి, 'కటక్', 'కలకత్తా' వంటి భారతదేశపు పట్టణాలలో ఎక్కువకాలం గడుపుతూ ఉండేవాడు. తన పట్టణవాసపు అంతులేని ఖర్చుల కోసం ఇంకా ఇంకా డబ్బు స్వాధీనం చేసుకోవటం మాత్రమే అతడు చేసిన సేవ. దీనికై అతడు తన జమీలో రైతులకు భూముల పంపకం తిరిగి కొత్తగా చెయ్యాలనుకున్నాడు. భూమిశిస్తు ఎక్కువ చెయ్యటమే దీని ఉద్దేశం.

కాని, పన్నులు కట్టాలని ఎవరి కుంటుంది ? చదువు సంధ్యలు లేని దోమెపాడా రైతులు సహితం ఈ కొత్తపద్ధతిని మొండిగా ఎదుర్కోవటంలో ఆశ్చర్యంలేదు. చాలామంది రైతులు భూముల్ని అనధికారంగా ఆక్రమించుకుని ఒక్కపైసా కూడా కట్టటం లేదు. కొత్త పద్ధతి ప్రకారం ఈ భూములకు కూడా శిస్తు విధించబడుతుందని వాళ్లు భావించారు. బ్రాహ్మణులు గ్రామ పెద్దలు కూడా అనధికారంగా లాభం పొందుతున్న వాళ్ళే ! ఈ అనధికార సంపత్తిని రక్షించుకోవడానికి వారే అమాయకులైన చదువురాని రైతాంగాన్ని సామూహిక విప్లవానికి ప్రేరేపించారు రాజుగారు రాజీపడక పోవటంతో ప్రజలు పన్నులు, శిస్తులు, కట్టకపోవటమే కాక, రాజకుటుంబాన్ని, శిస్తులు వసూలుచేసే ఆయన అధికారులను కూడా సాంఘికంగా వెలివేసారు.

ఫకీర్ మోహన్ తన 33 వ ఏట అక్కడికి వచ్చేసరికి రాజభవనం పాడుబడి అన్నివైపుల నుండీ అడవితో కప్పబడి ఉంది - రాజు అప్పుల

మీదనే బ్రతుకుతూ ఆ ప్రదేశంలో ఉండేవాడేకాదు. అప్పుడతని రాణి మనోవర్తికై కటక్‌లోని జిల్లా మేజిస్ట్రేట్‌కి దరఖాస్తు పెట్టుకొంది. అప్పటి కటక్ జిల్లా మేజిస్ట్రేట్ శ్రీ జాన్‌బీమ్స్. ఈ ఇబ్బందులలో అతడు ఫకీర్ మోహన్‌ని ఆ ప్రాంతానికి పంపించాడు. మేధావియైన ఈ ప్రసిద్ధ పురుషుడు, జమీందారుకి అతనికి ఎదురు తిరిగిన రైతులకీ రాజీ కుదర్చవచ్చునని అతడు ఆశించాడు. అప్పటికి బీమ్స్ పరస్పరం నిందించుకుంటూ ఉభయపక్షాల నుంచీ వస్తున్న దరఖాస్తులతో విసిగిపోయాడు.

ఒరిస్సావాసుల కేనాటినుండో అలవాటయిన సహాయ నిరాకరణ

ఫకీర్ మోహన్ రాజీకి ప్రయత్నం చేసినప్పుడు నివురుగప్పిన నిప్పులు ఒక్కసారి ప్రజ్వరిల్లాయి. ఒకప్పటి దివానయిన స్థానిక భూస్వామి నాయకత్వంతో ఈ తిరుగుబాటుదారులు మరొక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నారు. వాళ్ళు అన్ని గ్రామాలకూ, అన్ని వర్గాల ప్రజలకూ, రాజ భవనంతో, సాంఘిక వ్యాపార సంబంధాలను నిలిపివేయమని ఉత్తరువులు జారీ చేసారు. వాళ్లు రాజభవనంలోని సేవకులను సహితం హడలగొట్టారు. అక్కడి చాకలి వాళ్ళు రాజభవనంలో బట్టలు ఉతకటానికి నిరాకరించటం వల్ల దూరాన ఉన్న కటక్‌కు పంపి ఉతికించుకోవలసి వచ్చింది. బెస్తవారు, గొల్లవారు, నీరుమోసేవారు కూడా తరతరాలుగా తాము సంస్థానానికి చేస్తున్న సేవను నిలిపివేసారు.

ఉభయపక్షాలకూ మేలుచెయ్యాలని వచ్చిన ఫకీర్‌మోహన్ ఏ ఒక్కరి విశ్వాసమూ, పొందలేకపోయాడు. రాజు అతడిని మేజిస్ట్రేట్ మనిషి అని అనుమానించాడు. రైతులు అతడిని రాజుగారి మనిషి అనుకున్నారు – ఏ పాలనాధికారికయినా అదేమంత సుఖప్రదమయిన పరిస్థితికాదు

1876, డిసెంబరులో శ్రీ బీమ్స్ ఆకస్మిక పరిశీలనకై దోమ్‌పాడా వచ్చాడు ఫకీర్‌మోహన్ అభ్యర్థనపై శిస్తులు మరింత పెంచకుండా కొత్త పరిష్కార మార్గానికి అంగీకరించాడు. రాజు మాత్రం ఈ రెండింటికీ విముఖుడే! ప్రభుత్వ శాఖలలో అతడప్పటికే తలతిక్క మనిషిగా పేరు పొందాడు. అతనికీ అతని కౌలుదారులకూ మధ్య శీఘ్ర పరిష్కారం సాధ్యం కాక పోవటంతో, అతడు జమీ మొత్తాన్ని వదులుకోవలసి వచ్చే పరిస్థితి ఏర్పడింది.

కానీ, దోమ్‌పాడావంటి తరతరాలుగా వస్తున్న ఒరిస్సా జమిందారీ తాను దివానుగా ఉన్నంతకాలమైనా నాశనమయిపోకూడ దన్నది ఫకీర్‌మోహన్ ప్రగాఢవాంఛ.

ఆ కాలంలో మారుమూల గ్రామాలకు తనిఖీకి వెళ్ళిన ఇంగ్లీష్ జిల్లా మేజిస్ట్రేట్ కింద వందమందికిపైగా పరిజనం ఉండేవారు. సంస్థానం ఎదు ర్కొంటున్న సాంఘిక - ఆర్థిక ఇబ్బందులమధ్యకూడా అతిధి మర్యాదలన్నిం టితో ఆ పరివారాన్నంతటినీ హుషారుగా ఉంచే బాధ్యత దివానుదే! అందు చేత ఫకీర్‌మోహన్ కూరగాయలదగ్గిరనుండి అవసర వస్తువులనన్నింటినీ యాభైమైళ్ళ దూరాన ఉన్న కటక్‌నుండి తెప్పించుకోవలసి వచ్చింది - అతని ఇబ్బందులు మరింత ఎక్కువయ్యేలాగ, చలితో గడగడలాడిస్తూ రాకపోక లకు ఆటంకం కలిగిస్తూ, వర్షాలు ప్రారంభమయ్యాయి. వెలివేసిన ప్రజలు జమీనౌకర్లు, ఇళ్ళలో ఉండిపోయారు. దివాను మాత్రం తుఫానులో, బుర దలో జిల్లా మేజిస్ట్రేట్‌ని అహ్వానించటానికి అవసరమయిన అన్ని విషయాలూ పరిశీలిస్తూ అటూ ఇటూ తిరగవలసివచ్చేది.

ఈ పనులన్నీ చూస్తూనే రాజకీయపు ఎత్తుగడలు తెలిసిన దివాన్ కౌలుదారుల ప్రతిఘటనను అణచి వారిలో కొంతమందినైనా రాజావారి పక్షా నికి మళ్ళించడానికి అన్ని విధాలుగానూ ప్రయత్నాలు చేసాడు. చిట్ట చివరకు సాధించాననే అనుకున్నాడు కాని, త్వరలోనే బాధాకరమైన ఓటమిని ఎదుర్కోవలసి వచ్చింది. గ్రామ పెద్దలకు, పేరుమోసిన కౌలుదారులకు ఒక రోజు సాయంత్రం నాలుగు గంటలకు జిల్లా మేజిస్ట్రేట్‌ని కలుసుకోవల సిందిగా ఉత్తరువులు జారీచేయబడ్డాయి - దివాన్ ఆ ఉదయమంతా రాజావారి పక్షానికి వచ్చారనుకున్నవారందరికీ అయ్యగారు (Sahib) ప్రశ్నలు వేస్తే ఏమని సమాధానాలు చెప్పాలో తర్ఫీదు ఇచ్చాడు.

నాలుగు గంటలకు వడగళ్ళతో హోరున గాలివాన కురుస్తూనే ఉంది. బీమ్స్ పండితుడు బహుశః ఒరిస్సా ఆటవిక గ్రామంలోని అనాగరక వాతా వరణం మధ్య తన సుదీర్ఘ సమయాన్ని తన కభిమాన విషయమైన భాషా శాస్త్రాధ్యయనంలో గడుపుతూ ఉండి ఉండవచ్చు. నిశ్చయంగా అతడు విసుగెత్తించే ఉభయపక్షాల వాదోపవాదాలనూ వినే ధోరణిలో లేడు - ఫకీర్

మోహన్‌నీ, కౌల దారులనీ కలుసుకోవటానికి అతడు అపాదమస్తకమూ శాలువ కప్పుకొని వచ్చాడు

మేజిస్ట్రేట్ ఆజ్ఞలందుకుని చప్రాసీ గ్రామ పెద్దలను పిలిచాడు. వారందరూ ఒక్కసారిగా మేజిస్ట్రేట్ గుడారంముందు వరుసతీర్చి నిలబడ్డారు. కానీ, తాను ఉదయంనుంచీ ఎంతో జాగ్రత్తగా శిక్షణనిచ్చిన వారిలో ఒక్కడుకూడా ఆ గుంపులో ఫకీర్ మోహన్‌కు కనపడలేదు. తిరుగుబాటు చేసిన నాయకులు వారినెక్కడైనా నిర్బంధించారు కాబోలు!

వెచ్చని తన గుడారంలోకి పోయి, భాషాశాస్త్రాన్ని చదువుకోవాలని తొందరపడుతోన్న బీమ్స్, హిందీలో "దోమ్‌పాడా కౌలుదారులారా! రాజా గారితో మీకు వచ్చిన గొడవలన్నీ ఫకీర్ మోహన్‌బాబు సర్దుబాటు చెయ్యటం మీకు సమ్మతమేనా?" అని ప్రశ్నించాడు. వెంటనే కొందరు గ్రామ పెద్దలు "మా తగాదాలు దివాన్ సర్దుబాటు చేసేటట్లయితే, మీరు ఇలాంటి వాతావరణంతో కటక్‌నుండి ఇంత దూరం ఎందుకు వచ్చారు?" అన్నారు. బీమ్స్ ఒరియాతోసహా తూర్పు ఇండియా భాషలన్నింటిలోనూ పండితుడే అయినా, ఈ గ్రామ పెద్దలు వారి యాసలో అన్నదేమిటో సరిగా అర్థంచేసుకోలేకపోయాడు. అతడు తనకు వెనుకటి ఒరియా ఉపాధ్యాయుడైన ఫకీర్ మోహన్‌ని చూసి "వాళ్ళు ఏమంటున్నారు?" అని అడిగాడు.

సమయస్ఫూర్తిగల ఆ ఉపాధ్యాయుడు క్షణమైనా ఆలోచించకుండా "మా సమస్యలన్నీ పరిష్కరించటానికి దివానుబాబు సమర్థుడే! దొరవారు ఈ శ్రమంతా పడవలసిన అవసరంలేదు—అన్నారు" అని సమాధానమిచ్చాడు.

ఫకీర్ మోహన్ వ్యాఖ్యానానికి సంతృప్తుడయిన బీమ్స్ "చాలా మంచిది. ఈ కొత్త దివాను అన్ని విషయాలూ చూసుకుంటాడు. అతడు చాలా సమర్థుడు - అతనిలో నా కెంతో విశ్వాసం ఉంది. రైతులారా! సెలవు!" అని వీడ్కోలు వాక్యాలు పలికాడు.

వారిలో ఈ మాటలు ఎంతో అలజడిని కలిగించాయి "ఇంతకూ ఏం జరిగింది? మన పరిస్థితిని దొరగారు ఏమాత్రం అర్థంచేసుకున్నారు?" అనుకుని కృంగిపోయారు. కానీ, అప్పటికే అంతా తలక్రిందులయిపోయింది.

పండితుడు, ఉపాధ్యాయుడు అయిన ఫకీర్ మోహన్ పూర్తిగా మారి పోయాడు. అసాధారణ శక్తిమంతుడైన పాలకునిగా రూపొందాడు. మేజి స్ట్రేట్ ఆజ్ఞల అండతో అతడు వెంటనే గ్రామ పెద్దలనూ, వారి అనుచరు లనూ, తిరిగి దొరగారితో చర్చలు ప్రారంభించే అవకాశం లేకుండా తన సిపాయిల సహాయంలో అక్కడి నుండి తరిమివేసాడు. ఆ విషయం అలా ముగిసింది.

వాతావరణం బాగుండక పోవటం వల్ల బీమ్స్ కటక్ తిరిగి వెళ్ళటం ఆలస్యమయింది. అతడు ఆ సంస్థానంలోని ఇతర గ్రామాలకు బయలు దేరాడు. అనుకోని ఈ ప్రయాణం దివాను గడ్డుకాలాన్ని మరింత పొడిగిం చింది. కటక్ నుండి మేజిస్ట్రేట్‌కూ అతని పరివారానికీ తెప్పించిన సంభా రాలు చెల్లిపోయాయి. ఇప్పుడు అవన్నీ ఊళ్ళోనుండే తెప్పించుకోవాలి. ముందుగా గొల్లవాడికి మరునాటి ఉదయానికల్లా పాలూ, నెయ్యీ తెమ్మని చెప్పాలి. కానీ, వారెవ్వరు, ఎక్కడా కనపడలేదు. చివరికి ఒక గొల్లవాడు బాగా పొద్దుబోయాక అతిస్వల్పంగా పాలూ, నెయ్యీ తీసుకొచ్చాడు. బీమ్స్ గుడారానికి దగ్గరలోనే ఫకీర్ మోహన్ ఒక రైతు ఇంటి వరండాలో కూర్చుని ఉన్నాడు. కావాలని ఆలస్యంగా వస్తోన్న గొల్లవాడిని చూడగానే అతనికి వెర్రి ఆవేశం వచ్చింది. ఇంకా తుంపర పడుతోనే ఉంది. గ్రామంలో వీధి అంతా బురదగా ఉంది. ఒక దుంగ ఆ బురద వీధిలోపడి ఉంది. వెంటనే ఫకీర్ మోహన్ ఆజ్ఞలందుకున్న ఇద్దరు సిపాయిలు ఆ గొల్లవాణ్ణి ఆ దుంగకి కట్టివేసారు. ఒకడు పాలూ, నెయ్యీ అతని మీద గుమ్మరిస్తోంటే, మరొకడు ఆపమనేవరకూ కర్రతో దెబ్బల వర్షం కురిపించాడు.

ఇది ఉద్ధృతంగా సాగుతున్నప్పుడు ఆ గొల్లవాడి సహచరులంతా పరుగు పరుగున వచ్చి ఫకీర్ మోహన్ ఎదురుగా ఆ బురదలోనే సాష్టాంగ పడ్డారు. "కాపాడండి దొరా! ధర్మమూర్తులు. మీకు దణ్ణం పెట్టు కుంటాం! మావాడి కట్టు విప్పండి. ఇక నుండీ తమకు కావలసినన్ని పాలూ, నెయ్యీ తెచ్చి ఇస్తాం!" అంటూ ముక్త కంఠంతో మొఱపెట్టు కున్నారు.

నయాన నచ్చచెప్పబోతే సాధ్యంకానిది దండనతో నెరవేరింది. ఒక్క అరగంటలో పాలు, నెయ్యి, చేపలు ఇంకా కావలసినవన్నీ దొరవారికీ,

అతని పరివారానికీ కుప్పతెప్పలుగా వచ్చిపడ్డాయి. ఒక్క గట్టిదెబ్బతో సహాయ నిరాకరణ, పన్నుల ఎగవేత, అన్నీ చెల్లాచెదరైపోయాయి. దివాన్ ఫకీర్ మోహన్ చిక్కుముడిని విప్పేసారు.

విజయమని గర్వించేలా ఏదీ విజయవంతం కాలేదు. ఇలా పరిస్థితులు అనుకూలంగా మారటంతో ఫకీర్ మోహన్ నాయకులైన కొందరు గ్రామ పెద్దలపై బీమ్స్ ముందు 'క్రిమినల్ కేసులు' పెట్టాడు. ప్రజాందోళన పేరిట జరుగుతోన్న ఈ అల్లరులకు ప్రధాన కారకుడు ఒకప్పుడు దివానుగా పనిచేసిన దయానిధి పట్నాయక్ బంధువు – అతనిపై కూడా ఫకీర్ మోహన్ 'క్రిమినల్ కేస్' పెట్టాడు. ఆ సమయంలో ఫకీర్ మోహన్‌కి గ్రామ పెద్దలందరూ దొరవారి ముందు తమ ఇబ్బందులు విన్నవించుకోవటానికి చివరి ప్రయత్నంగా చుట్టుప్రక్కల గ్రామీణులందరినీ కూడ దీసుకుని దొరవారి గుడారానికి తరలి వస్తున్నట్లు తెలిసింది. సమయస్ఫూర్తిగల ఫకీర్ మోహన్ అంతకు ముందే తాను క్రిమినల్ కేసులలో ఇరికించిన వారందరినీ అరెస్టుచెయ్యవలసిందిగా అరెస్ట్ వారంటుతో 'పోలీసు కాన్స్టేబుల్స్'ని పంపాడు. విప్లవకారులు సీరింకిపోయిన నదిని దాటుతుండగానే సేనాపతి పోలీసులు త్వర త్వరగా తమకు కావలసిన వారి చేతులకు బేడీలు వేసారు. ఇది గ్రామీణులకు విద్యుదాఘాతమయింది. మిగిలిన వారందరూ ప్రాణాలరచేతపట్టుకుని పరుగులు తీసారు. దానితో తిరుగుబాటు ఆఖరయింది.

ఇప్పుడు దోమ్‌పాదాలో శాంతి నెలకొంది. వ్యవహారాలన్నీ సవ్యంగా సాగుతున్నాయి. ఫకీర్ మోహన్ సమస్యాపరిష్కారాలకు పూనుకొన్నాడు. రాజావారిప్పుడు సంతోషంగా ఉన్నారు. అతడు ఫకీర్ మోహన్‌ని జీవితాంతమూ తన దివాన్‌గా ఉంచుకోవాలని ఆరాటపడ్డాడు. ఉద్యోగ విరమణ తరువాత ఎక్కువ 'పెన్షన్' ఇయ్యాలనికూడా సంకల్పించుకున్నాడు. అతడీ సూచనలన్నీ కమిషనర్ దృష్టిలోకికూడా తెచ్చాడు. కానీ, ఆలోచనాపరుడైన బ్రిటిష్ అధికారి ఫకీర్ మోహన్ రాజా మాటలు మన్నించి అక్కడే ఉండిపోవటంకంటే ప్రభుత్వం ధేన్‌కనల్ (Dhen kanel) లో అసిస్టెంట్ మేనేజర్‌గా ఇస్తున్న ఉద్యోగం చెయ్యటం మంచిదని అన్నాడు. అప్పటికి కోర్టువారి ఆధీనంలో ఉన్న ఆ సంస్థానంలో జీతమూ, హోదా, రెండూ పెరుగుతాయని అన్నాడు.

రాజావారికీ ఆయన పరివారానికీ అన్ని సమస్యలనూ, దక్షతగా, హుందాగా, సవ్యంగా, పరిష్కరించి ఎంతో పేరు ప్రఖ్యాతులతో ఫకీర్ మోహన్ దోమ్‌పాడా వదిలిపెట్టాడు. సమస్యా పరిష్కారానికై తాను కొంత కఠినంగా ప్రవర్తించానేమోననే పరితాపంతో అతడు ఒకప్పటి దివానయిన దయానిధి పట్నాయక్ గారికి, తదితరులకు కొంత నష్టపరిహారాన్ని చెల్లించాడు. ఈ సాహసి మానవతా విలువలను వర్ణించటానికి ఎన్ని గ్రంథాలైనా సరిపోవు.

# 7

# సంస్థానంలోని ఉన్నత సైనికాధికారి

కియోన్‌ఝార్ (Keonjher) ప్రస్తుతం ఒరిస్సాలోని ఒక జిల్లా—కానీ పూర్వం అది ఒక ప్రత్యేక రాష్ట్రమే! దానిని సుప్రసిద్ధ రాజవంశానికి చెందిన భంజా (Bhanjas) వంశీయులు పరిపాలించేవారు. ఒరిస్సా మధ్యయుగపు కవులలో ప్రసిద్ధిచెందిన ఉపేంద్రభంజా ఈ వంశానికి చెందినవాడే! ప్రఖ్యాత భంజావంశమైన మయూర్ భంజా వంశపు (Mayurbhans) శాఖకు చెందినవారు కియోన్‌ఝార్ భంజావారు. వీరు ఒరియా సంస్కృతి సాహిత్యాలకు చెప్పుకోదగిన సేవచేసారు.

1887 తో ఫకీర్‌మోహన్ తన 45 వ ఏట మగసిరి తొణికిసలాడే శక్త్యుత్సాహాలతో కియోన్‌ఝార్ మేనేజరుగా ప్రవేశించాడు. సమర్థుడు విద్యావంతుడు అయిన మహారాజా ధనంజయ భాంజా అతని యజమాని. అతడు ప్రవేశపెట్టిన సాగుభూములలో నీటిపారుదల పథకాలు, అతని పరిపాలనాదక్షతకూ, ప్రజాహితంకోరే అతని సుస్వభావానికి నిదర్శనంగా నేటికీ నిలిచి ఉన్నాయి

## రాజును నిర్ణయించే భుయానులు (Bhuyans)

భూయాన్ తెగవారి మాతృభూమి,కియోన్‌ఝార్. ధనంజయ్ నారాయణ్ భాంజా అభ్యుదయ దృక్పథం కలవాడు అతడు ధరణీధర్ అనే భుయాన్

యువకుడిని భూముల 'సర్వే' లో శిక్షణ పొందటానికి ప్రభుత్వం ఖర్చుమీద కటక్ పంపించాడు. శిక్షణ ముగిసిన తరువాత అతడు "ప్రొబేషనరీ సర్వేయర్"గా నియమింపబడ్డాడు.

ఇంచుమించుగా ఒరిస్సా అంతటా వెట్టి చాకిరీ అమలులో ఉండేది. ప్రతి కుటుంబమూ సంవత్సరంలో కొన్ని రోజులు ప్రభుత్వానికి తమ వంతు వెట్టి చాకిరీ చెయ్యవలసివచ్చేది. పేదవారయిన కూలిజనం గట్టిదెబ్బ తినే వారు. యువకులను తమకున్న కొద్దిపాటి పొలం పనులను చూసుకోవటానికి వదిలేసి వయసుమీరిన మొగవాళ్ళే వెట్టి చాకిరీకి వెళ్ళేవారు. వృద్ధులైన ఆ కుటుంబ పెద్దలు తమ సంభారాలనూ, పనిముట్లనూ, తామే మోసుకుపోవలసి వచ్చేది—నడుం విరిగేలాగ రోజంతా చాకిరిచేసి అప్పుడు తమ తిండి తామే వండుకుని బట్టబయల పడుకోవలసి వచ్చేది. రాష్ట్రంలో అన్ని తరగతుల వారికిలాగానే భూయానులుకూడా మానవమాత్రులు చెయ్యలేని సేవలన్నీ చెయ్యవలసివచ్చేది. బ్రాహ్మణులు, సంపన్నులైన గృహస్థులు, అధికారులు మాత్రం ఈ దురవస్థనుండి తప్పింపబడ్డారు. కియోన్‌ఝూర్ అసిస్టెంట్ మేనేజరయిన విచిత్రానందదాస్ ఒక చిన్న ఆనకట్ట పనిలో భుయానులను మాత్రమే నియమించి వారిపట్ల చాలా క్రూరంగా ప్రవర్తించేవాడు. తన కొరడాను యథేచ్ఛగా ఉపయోగిస్తూ తరుచుగా కాలేకడుపులతో పనిచేయించే వాడు. అత్యంత సున్నిత మనస్కులైన భుయానులు మౌనంగా కోపంతో ఉడికిపోతూ, పగ తీర్చుకోవటానికి ఒక నాయకుడికోసం ఎదురుచూస్తున్నారు. కటక్‌లో విద్యావంతుడయిన ధరణీధర్‌లో ఆ నాయకత్వం లభించింది. భూయానులకు ఒకప్పుడు రాష్ట్రమంతా తమదేనని, హిందువులచేత అన్యాయంగా పాడిపంటలులేని కొండప్రాంతాలకు నెట్టివేయబడ్డామనీ, బాగా గుర్తుంది. పూర్వం కియోన్‌ఝూర్ మయూర్‌భంజ్ రాష్ట్రానికి పక్కనే ఉండేది. కానీ, రాజధాని దూరంగా ఉండటంవల్ల భుయానులకు అంతదూరం ప్రయాణంచేసి, నాయకునిపట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించడానికి వీలయ్యేది కాదు. ఆ కారణంచేత వాళ్ళు ఒకసారి మయూర్‌భంజ్ వంశీయుల ఇంటి నుండి ఒక యువరాజును ఎత్తుకొచ్చి అతడిని తమ రాజుగా చేసుకున్నారు. కానీ, రాజుగారు ఏనుగుమీదనో, గుర్రంమీదనో స్వారీ చెయ్యాలి. అవేవీ భుయానుల దగ్గిరలేవు. అందుచేత భుయాన్ పెద్దలలో ఒకడు చేతులతోకూడా నడిచేవాడు—చిన్న రాజావారిని అతనిపై కూచోబెట్టి ఏనుగుమీద ఊరేగించి

నక్షే భావించేవారు. ఆ రకంగా అతని సార్వభౌమాధికారం ప్రకటింప బడేది. అప్పుడు ఇంకొక భుయాను నాయకుడు యువరాజుముందు సాష్టాంగ పడేవాడు. చిన్నరాజావారు తన కత్తితో నాయకుని మెడను తాకేవారు ఆ విధంగా ఆ తెగ అతనికి తప్పుచేసిన భుయానులను దండించే అధికారం ఇచ్చింది. కియోన్‌ఝార్‌లో కొత్త రాజు పట్టాభిషేకం జరిగినప్పుడల్లా ఈ ఆచారాలన్నీ ఈనాటికీ పాటింపబడుతున్నాయి. ఆ కారణంచేత అమాయకులైన భూయానులు కియోన్‌ఝార్ రాజాను ఎన్నుకోవటం, ఎన్నుకోకపోవటం, తమ హక్కు, తమ బాధ్యత అని భావించేవారు తమ గెడ్డమీదే తమను భయపెట్టే దమ్ములు ఎవరికీ ఉండవనుకున్నారు.

అధికారం నటించే రాజు

కటక్‌లో ఉండే రోజులలో భుయాన్ యువకుడైన ధరణీధర్, దేశ భక్తినీ, అభ్యుదయ భావాలనూ జీర్ణించుకున్నాడు. పొరుగు బ్రిటిష్ జిల్లా అయిన సింగ్‌భమ్ (Singhbhum) వారితో వచ్చిన సరిహద్దు తగాదాలలో తన రాష్ట్ర అధికారులకి సహాయం చేస్తున్నప్పుడు, తన తమ్ముడు గోపాల్‌నీ మరికొందరు దగ్గిరబంధువులనూ, రాజాగారు అరెస్టుచేసి జైల్లో పెట్టారని తెలిసి నిర్ఘాంతపోయాడు. అతడు వెంటనే ఉద్యోగం వదిలేసి, భుయాన్‌జాతి వారుండే ప్రాంతాలన్నీ పర్యటించి తనవారితో వ్యవస్థకు వ్యతిరేకంగా తిరుగుబాటును లేవదీసాడు. అతడు తనను తాను మహారాణి పెంపుడు కొడుకుగా ప్రకటించుకొని, ఆ హోదాలోనే తన సంతకంతో 'ఫర్మానా'లు పంపేవాడు. వందలాది కొండజాతివారు, విల్లమ్ములతో యుద్ధానికి సిద్ధంగా అతనిచుట్టూ చేరారు. రాజావారి పశువుల మందలనూ, పోలీసు స్థావరాలనూ ముట్టడించటంవల్ల విప్లవకారులు కొన్ని మారణాయుధాలనూ, అడవులలో దాగినప్పుడు సరిపడేటంతగా ఆహార సామాగ్రినీ, పోగుచేసుకున్నారు.

ఫకీర్‌మోహన్ కియొన్‌ఝార్ వ్యవహారాలన్నీ రాజు నివసించే కియొన్‌ఝార్ నుండికాక ఆ రాష్ట్ర ఆర్థిక సంపదకంతకూ కేంద్రమయిన రాష్ట్ర రెండవ మహానగరం ఆనందపురంనుండి వ్యవహారాలన్నీ చూసుకునేవాడు. భుయాను విప్లవం తాలూకు వదంతులు ఫకీర్‌మోహన్ చెవికి సోకగానే కియోన్‌ఝార్‌నుండి ఆనందపురంవరకూ ఎందరో వార్తాహరులను ఎప్పటికప్పుడు విప్లవకారుల చర్యలను తెలియజెయ్యటానికి నియమించాడు.

కానీ, విప్లవం మొదలయిన మూడవరాత్రి మహారాజు తన రాణివాసాన్ని నిర్జన రాజభవనంలో వాళ్ళ కర్మానికి వదిలేసి, తన సైన్యంతో కటక్ పారిపోవటం ఫకీర్ మోహన్‌ని నిశ్చేష్టుణ్ణి చేసింది.

ఫకీర్ మోహన్ మొట్టమొదట రాష్ట్ర సైనిక సిబ్బందిని విప్లవకారులను ఎదుర్కోవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ తరువాత వణికిపోతున్న మహారాజుని కటక్ తీసికెళ్ళాడు. అక్కడ మిలిటరీవారి సహాయం పొందటానికి ఎంతో కృషిచేసాడు. తన కృషిలో చాలావరకు విజయం సాధించి ఫకీర్ మోహన్ రాజాగారితో ఆనందపురానికి తిరిగివచ్చాడు. ముందుగా మహా రాజుగారు ఏనుగుమీద పోతుండగా ఆ వెనుక మరో ఏనుగుమీద ఫకీర్ మోహన్ అనుసరిస్తుండగా—విప్లవకారుల గొరిల్లాదాడులనుండి తప్పించుకోవటానికి, సేనలు రాత్రి పూట అడవి మార్గంగుండా రాజధానివైపు మళ్ళాయి.

సైనికదళం

వారి రెండవరాత్రి మజిలీలోనే, విప్లవకారులు రాజభవనాన్ని ముట్టడించినవార్త చేరింది. హడలిపోయిన మహారాజు తిరిగి కటక్ పారిపోయాడు. కానీ, అతడు పారిపోవటానికిముందే సంయమనంతో ఆలోచించగలిగిన అతని మేనేజరు ఆత్మరక్షణకుకాని, ఆస్తిరక్షణకుకాని, రాజభవనంలో వదిలివేయబడ్డ రాణివాసపు మానరక్షణకుకాని, భయానులను సంహరించవచ్చునని అధికార పత్రం సంపాదించుకున్నాడు.

సేనాపతి ఫకీర్ మోహన్ తన వంశనామాన్ని సార్థకపరుస్తూ సేనానాయకుడై సేనలకు ముందు నడిచాడు. ఈ ఆశించని అసాధారణ సేనానాయకత్వపు బాధ్యతతో, నవీనపద్ధతులలో సేనను నడిపిస్తూ, ప్రతి మజిలీలోనూ, స్వయంగా వారి ఆయుధాలను పరిశీలించేవాడు. ఇదంతా ఆయనకు అంతులేని ఆశ్చర్యాన్ని కలిగించింది. కానీ, దాని నతడు పైకి తెలియనీయలేదు. సిపాయీలలో అధికభాగం వృద్ధులే! బహుశః వారి తాతముత్తాతలెవరైనా మరాఠీల కాలంలో ఈ రకమైన సైనిక దాడులను చూసి ఉండవచ్చునేమో! కానీ, "డెక్స్ బ్రిటానికా" కింద దాదాపు ఒక శతాబ్దంపైగా వాళ్ళ కత్తులకు పనిలేక తుప్పుపట్టి ఒరలలో పడి ఉన్నాయి. అనుకోని ప్రయాణంతో వాళ్ళు ఇల్లువదిలేముందు తొందరలో తమ తుపాకులను

పరీక్షించుకోనేలేదు. చాలామంది తగినంత తుపాకిమందు తెచ్చుకోవటానికి కూడా విలు లేకపోయిందని ఫిర్యాదు చేసారు.

ఇలాంటివాటికి చలించక ఫకీర్ మోహన్ తన సైనికదళాన్ని ధైర్యంగా ముందుకు నడిపించాడు. వారిలో కొందరు గడుసువారు తమ అసమర్థతనలా ఉంచి ఎంతో ధైర్యంగా తమ తుప్పుపట్టిన కత్తులను సేనాపతిముందు తిప్పుతూ భుయాన్ తెగని నాశనం చేసేస్తామని చాటారు. సూక్ష్మదృష్టిగల ఫకీర్ మోహన్ మానవునిలోని బడాయిలు చెప్పుకొనే మనస్తత్వాన్ని ఎప్పుడూ జాగ్రత్తగాచూసి ఆనందించేవాడు. ఈ పరిశీలనలే తరువాతి కాలంలో ఆయన వ్రాసిన కథలకూ, నవలలకూ, మహత్వాన్ని ఆపాదించాయి.

## నేర్పుగా ఓటమిని అంగీకరించినవాడు

ఫకీర్ మోహన్ రాజధానిని సమీపించేసరికి, భూయనులు నిజంగా రాజభవనాన్ని ముట్టడించలేదనీ, దగ్గిరలో ఉండే 'రైసన్' అనే గ్రామపు కొండల్లో సరిగ్గా రాజధానివెనుక గుమిగూడారనీ, త్వరలో ముట్టడించ బోతున్నారనీ తెలిసింది. విప్లవకారుల కుయుక్తులను భంగం చెయ్యడానికీ, వారిని వారి రహస్య స్థావరాలలో కలుసుకుని అక్కడే సంహరించటానికి గుండాల గుంపుని నియమించాడు అతడు విప్లవకారుల స్థావరాలనూ, వారి బలగాన్ని తెలుసుకోవటానికి గూఢచారులను నియమించాడు. కానీ వారు అతనిని మోసగించారు. వారి తప్పుడు లెక్కలను నమ్మి అతడు తెలివి తక్కువగా తిన్నగా శత్రుగుడారంలోకి వెళ్ళిపోయాడు అతడు తన సేనతో రైసన్ కనుమను దాటుతోంటే, అక్కడి రెండువైపుల కొండలూ తుపాకి మోతలతో ప్రతిధ్వనించాయి. పగటి వెలుగులో విప్లవకారులు విల్లమ్ములతోనో నాటుతుపాకులతోనో, పొదలమాటునా, చెట్లమాటునా దాగిఉండటం అతడు చూసాడు.

అతడు ఏం చెయ్యాలో ఆలోచించేటంతలో ఒక బాణం ఇంచుమించుగా అతని మెడకి గాయం చెయ్యబోతూ దూసుకుపోయింది. వెంట్రుకవాసిలో తప్పిపోబట్టిగానీ, లేకపోతే, అతని భుజాలపైన శిరస్సు ఉండేదికాదు. శత్రువులు బలగంలోనూ, కొండ బంపులదగ్గిర ఉండటంచేతా—శక్తిమంతంగా కనబడటంతో అనవసర రక్తపాతం దేనికని లొంగిపోయాడు.

## తెలివితేటలే ఆయుధంగా యుద్ధం

అప్పటి పరిస్థితుల్లో సాయుధపోరాటాన్ని విరమించటమే మంచిదని లొంగిపోయినా, గడుసువాడైన ఫకీర్‌మోహన్ వెంటనే తెలివితేటలతో శత్రు నాశనం చెయ్యటానికి సమకట్టాడు. పట్టుబడిన మేనేజరు కియోన్‌ఝూర్ సింహాసనాధికారి ననుకొంటూన్న ధరణీధర్ ముందుకు తీసుకుపోబడ్డాడు. ఒకప్పటి తన క్రింది ఉద్యోగిగా ధరణీధర్‌ను ఫకీర్‌మోహన్‌కి పూర్వమే తెలుసు. కానీ, అతడు కొత్త పరిస్థితులకు అనుకూలంగా త్వరలోనే సర్దుకున్నాడు. తాను తన కుటుంబాన్ని పోషించుకోవటానికి పనిచేసే ఒక ఉద్యోగిని మాత్రమేనని ప్రకటించుకున్నాడు. కొత్త మహారాజావారికి దివానుగా పనిచెయ్యగలిగితే తనకు చాలా సంతోషమని అన్నాడు.

ధరణీధర్ అక్కడ సమావేశమయిన తన అనుచరులతో అంత పెద్ద రాష్ట్రాన్ని పాలించటం తన ఒక్కడివల్లా కాదు కాబట్టి సమర్థులైన అధికారుల అండదండలు కావాలని అన్నాడు. పరిపాలనా విషయాలన్నీ తెలిసిన మేనేజర్ ఇక్కడే ఉన్నాడు. అతడినే ఎందుకు నియమించుకోకూడదు? సాధారణంగా అధికారులను అనుమానించే భుయానులు తమ వ్యతిరిక్తతను లోలోపల అణచుకుని తమ నాయకుడి ప్రతిపాదనను అంగీకరించారు. ఫకీర్‌మోహన్‌కి ఆ విషయం పూర్తిగా తెలియకపోలేదు. అంచేత అతడు వరుసగా కొన్ని పన్నాగాలతో వారి విశ్వాసాన్ని చూరగొనాలని ప్రయత్నించాడు. ఆ విధమయిన అసాధారణ చాతుర్యంతో అతడు మహారాజభవనాన్ని నాశనం చెయ్యాలనే వారి ప్రయత్నాలను ఆపుచేసాడు. అంతకంటె చక్కటి పద్ధతిలో ఆధునిక ఆయుధాలతో రాజభవనాన్ని చిటికెలో నాశనం చెయ్యవచ్చునని సలహా ఇచ్చాడు. అనవసరంగా విల్లమ్ములతో యుద్ధానికి సాహసించి ప్రాణ నష్టం పొందటం దేనికి?

ఆ కొండజాతివారు కలకత్తానుండి రాబోయే "డైనమైట్" కోసం ఎదురుచూడసాగారు.

ధరణీధర్‌కు ఫకీర్‌మోహన్‌లాగే తమలపాకులు నమలటం అలవాటు. ఈ రకంగా వారిరువురూ మరింత సన్నిహితులయ్యారు. మరిన్ని తమలపాకులు తెప్పించాలనే మిషతో ఫకీర్‌మోహన్ తీవ్ర సైనిక చర్యను సూచిస్తూ మహారాజుకు ఒక గూఢలేఖ వ్రాసాడు. 1891 వ సంవత్సరం మే పదహారవ

తేదీన వ్రాసిన ఈ ఉత్తరం భోలానాథ్‌ని ఉద్దేశిస్తూ వ్రాయబడింది. ఈ భోలానాథ్ ఫకీర్‌మోహన్ మనుష్యులలో ముఖ్యుడిగా భావింపబడుతున్నాడు. వాస్తవానికతడొక రాష్ట్రోద్యోగి. యథావిధిగా ధరణీధర్‌చేత 'సెన్సార్' చేయబడ్డ (పరిశీలింపబడ్డ) ఆ ఉత్తరం ఇలా ఉంది.

"ఇది నా 'ఏజంట్' అయిన భోలానాథ్‌కి తెలుపుతున్న విషయం. మహారాణిగారి కుమారుడికి అత్యవసరం కనుక ఎలాగైనా కనీసం ఒక వంద 'బెటెల్సు' (బెటాలియనులు—సైనిక దళాలు లేక తమలపాకులు) రెండు వందల పోకలూ పంపవలసింది. నా చెరుకు పొలానికి నీళ్ళుపట్టడానికి ఉత్తరంవైపున ఒక గొయ్యి తవ్వండి. లేకపోతే గడలన్నీ తొందరలోనే ఎండిపోతాయి."

ఆ జాబు మూడు తీగముక్కలతో కట్టబడింది. అదృష్టవశాత్తు అధికారులు తమలపాకుల్ని సైనికులుగానూ, పోకలను తుపాకులుగానూ, సేనాపతి గూఢసమాచారాన్ని సరిగా అర్థం చేసుకున్నారు. 'టెలిగ్రాము'ల ద్వారా ఇతర అధికారులకు తీవ్ర పరిస్థితిని గురించిన సమాచారం అందించి తగినంత సైనిక సహాయాన్ని సిద్ధంగా దించుకోవలసిందని ఫకీర్‌మోహన్ తీగల ద్వారా సూచించిన విషయాన్నికూడా సరిగానే అర్థంచేసుకున్నారు. ఇదంతా చాలా త్వరగా జరిగిపోయింది. ఒక శుభోదయాన రాజుననుకొంటోన్న ధరణీధర్, అతని అనుచరులూ, రహస్య స్థావరాలమీదకి అకస్మాత్తుగా వచ్చి పడిన సేనాసమూహం చేతిలో చిక్కుకున్నారు. చిరకాల కఠిన కారాగార శిక్ష విధించబడటంతో, కియోన్‌ఝార్‌కి మహారాజును కావాలనుకున్న భయానుడైన ధరణీధరుడి కలలన్నీ కల్లలయ్యాయి.

# 8

# యమలోకంలాంటి ఇల్లు - దానిలో స్వర్గం సృష్టించిన రెండవ భార్య

ఫకీర్‌మోహన్ బాహ్యజీవితం ఎంత అద్భుతమైనదో, అతని ఆంతరంగిక జీవితం అంత నిస్సారమైన ఎడారిలాంటిది. అంతటి అసాధారణ

మేధానిధి వ్యక్తిగా ఏకాకి. ఇరువురు స్త్రీల అపూర్వమైన స్త్రీత్వపు సారభాలు అతనిని కొద్దికాలం మాత్రమే ఒంటరితనం నుండి విముక్తుణ్ని చేసాయి. కానీ, ఆ మేధావి సృజనాత్మక ప్రతిభ ప్రాథమికదశ దాటి పైకి రాక పూర్వమే, ఆ దేవత లిరువురూ, అతడిని దుఃఖ సముద్రంలో ఏకాకిని చేసి ఈ లోకం వదిలి వెళ్ళారు.

జీవితంలో నైరాశ్య దృక్పథం అలవరచుకుని విరక్తితో రోజులు నెట్టుకు రావలసిన వాతావరణంలో ఉన్నాడతడు. అయినా, చైతన్య వంతంగా నిండైన జీవితాన్ని ప్రదర్శిస్తున్నాడు! తన జీవితాకాశంలో ఎదు రైన విషాద మేఘాలలో తళుకుమనే ఆశారేఖలను అపురూపంగా పదిలపరచు కున్నాడు! మానవునిలోని జంతు లక్షణాలను గమనించి మనసారా నవ్వు కున్నాడు! ఆ నవ్వులు ఇతరులతో పంచుకున్నాడు! వ్యక్తిగతమైన వ్యథ లెన్నిఉన్నా, అతని వ్యక్తిత్వంలోని అమోఘమైన సమన్వయం, సమస్త ప్రపంచాన్నీ సానుభూతితో చూసే దయార్ద్రహృదయం, ఇది; అంతగా విద్యావంతులు కాని ఆ ఇరువురు స్త్రీమూర్తుల అచంచలప్రేమ, ఆత్మార్పణ అతని కందించిన మనోబలంవల్లనే సాధ్యమయ్యాయి కాబోలు! ఇలాంటిది స్త్రీలే సాధించగలరు!

వైవాహిక జీవితానందం

ఫకీర్‌మోహన్ జీవితంలోని ఇరువురు దేవతలూ, అతని పితామహి కుచిలాదే, అతని రెండవ భార్య కృష్ణకుమారి.

మరీ విడ్డూరంగా అతని పదమూడవ ఏటనే పెద్దవాళ్లు అతని మెడలు వంచి పెళ్ళిచేశారు. అతని భార్య అతని రాతిగుండె పెద్దమ్మతోచేరి, బలా సోర్‌లోని అతని తొలి దినాలలో అతనికి నరకం సృష్టించింది. నిర్భాగ్యు డైన అభర్త ఇలా అంటున్నాడు. "బలాసోర్‌కి చెందిన 'మానిక ఖంబ' (Manıka khamba) ప్రాంతవాసి అయిన నారాయణ్ పారిడ (Narayan Parıda) కూతురు లీలావతీ దేవిని పెళ్ళిచేసుకున్నాను. నాకు 29 సంవత్స రాలు వచ్చేవరకూ ఆమెనాతో ఉంది. ఆవిడ హృదయం లేనిది. మొండిది – కర్కశంగా మాట్లాడేది. అన్నింటికంటె, సరిగ్గా నా ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించటంలో ఆనందించేది. నా చిన్నతనంలో నన్ను వేధించిన రోగాల కంటె ఈ దాంపత్యం నాకు చాలా బాధాకరంగా ఉండేది. దుర్భరమైన

మానసికయాతన అనుభవించిన ఆ రోజులలో ఎప్పుడూ, ప్రచారంలో ఉన్న ఒక సంస్కృత చాటువు గుర్తుచేసుకునేవాడిని—

ఇంటిదగ్గిర మమతామయి మాతృమూర్తి లేనివాడు,
గంపగయ్యాళి ఇల్లాలు అయినవాడు,
కారడవులలోకి పారిపోవటం మంచిది.
వాడి ప్రాణానికి ఇల్లూ, అడవీ రెండూ ఒకటే!

"ఆ సమయంలో నాకు శాంతినిచ్చే ఏకైకాధారం మా పితామహి మాత్రమే! ఆవిడ మరణించాక 'ఇల్లు' అనబడేది నరకంగా తయారయింది. చివరకు నా మొదటి భార్యకి పెద్ద జబ్బు చేసింది. ఒక సంవత్సరంపాటు వైద్యం చేసాక అదింక నయంకాదని అన్నారు. చివరి ప్రయత్నంగా ఆమె తలి దండ్రులు లామెను వారింటికి తీసుకుపోయారు. అక్కడే ఆమె మరణించింది. అప్పుడు నేను పూరీలో ఉన్నాను.

## రాతిగుండె పెద్దమ్మ

అనుకూలవతియైన ఇల్లాలు లేనందువల్ల కలిగే కష్టాలకు తోడు ఫకీర్ మోహన్ దయాదాక్షిణ్యాలులేని క్రూరురాలైన పెద్దమ్మ చేతిక్రింద బ్రతికే వాడని మన కిదివరకే తెలుసు. వీళ్ళిద్దరూ ఫకీర్‌మోహన్‌ని పిచ్చివాణ్ని చేసారు. నరకంలాంటి ఇంట్లో ఉంటూకూడా బయట ఉపాధ్యాయుడిగా – రచయితగా – పండితుడిగా – అన్నింటికీమించి తన జాతి నాయకుడిగా – ఇలా అన్ని రంగాలలోనూ రాణించిన ఫకీర్‌మోహన్‌లోని జన్మసిద్ధమయిన సామర్థ్యము, అద్భుతమయిన జీవచైతన్యమూ వర్ణించటానికి ఎన్ని గ్రంథాలయినా సరిపోవు. మొదటి భార్యతోనూ, పెద్దమ్మతోనూ దారుణమైన కష్టాలనుభవించిన ఆలోచనాపరుడైన ఫకీర్‌మోహన్ రెండవ వివాహం తల పెట్టి ఉండేవాడుకాదు. కానీ, మొదటి భార్య మరణించాక సంఘంలో ఉండే ఛాందసులు హిందువులలో పురుషు డీ విధంగా వారసులులేకుండా ఉండకూడదని అతని చెవిలో ఇల్లు కట్టుకుని పోరారు. అలా ఉంటే, తాత ముత్తాతల నుండి వస్తున్న ఆత్మసంబంధాన్ని పుట్టబోయే వారి నుండి చేజేతులా తెంపివేసినవాడవుతాడని గోలపెట్టారు. అనాథ అయిన ఫకీర్ మోహన్ తలిదండ్రులు తెలియకపోయినా వారి జ్ఞాపకాలు భక్తితో తనలో పదిలపరచుకున్నాడు. అందుచేత తన సంతోషంకంటె మరణించిన వారి

ఆత్మశాంతికై త్వరలోనే తన శ్రేయోభిలాషుల వివాహ ప్రస్తావనకు సమ్మతించాడు.

## అతని ఎడారి జీవితంలో ప్రవేశించిన దేవత

ఈ పెళ్ళికూడా పెద్దలు ఏర్పాటుచేసినదే! బంధువులలో ఎవరో స్త్రీలు ఈ సంబంధం స్థిరపరిచారు. కాబోయే వధువు వయసు 12 సంవత్సరాలు మాత్రమే! కాబోయే భర్త వయసులో సగం కంటె తక్కువ. కానీ, విచిత్రంగా, పసిపిల్ల – రెండవ భార్య – కృష్ణకుమారి – ఆ మేధావి జీవితాన్ని ఆనందమయం చేసింది. అతని సుదీర్ఘజీవితంలో అతడెరిగిన ఆనందమది మాత్రమే! ఇది మనకు చార్లీచాప్లిన్ తన నాలుగవ భార్య ఊనాతో ఆనందమయ జీవితం గడపటం గుర్తుచేస్తుంది. ఇవన్నీ వివాహాలు స్వర్గంలో జరుగుతాయనీ, వైవాహిక జీవితానందం మానవుని ఊహాకందనిదనీ, భావించే సామాన్యుల విశ్వాసాన్ని బలపరుస్తున్నాయి.

కృష్ణకుమారి ఆమె భర్తకు అదృష్టదాయకురాలు కూడా అయింది. ఆమెను వివాహం చేసుకున్న కొద్దికాలంలోనే అతనికి నీలగిరి సంస్థానంలో దివానుగా ఉద్యోగం వచ్చింది. ఒక బడి పంతులుకు ఇది అసాధారణమైన పెద్ద ఉద్యోగం.

కృష్ణకుమారీ ఫకీర్‌మోహన్‌లు భార్యాభర్తలుగా పాతికేళ్ళు బ్రతికారు. అంతగా చదువుకోని ఈ సామాన్యురాలు చనిపోయినపుడు మేధావియైన భర్తను ఆతడు ఆఖరిశ్వాస విడిచే వరకూ, మరో పాతిక సంవత్సరాలు తీరని దుఃఖంలో ముంచేసింది. మహాపురుషుడయిన తన భర్త కన్నీటి ద్వారా మొత్తంజాతి వాఙ్మయాన్నే తన పవిత్ర స్మృతులతో ఆర్ద్రం కావించింది.

## ప్రియాతిప్రియమైన పితామహి

సాంఘికాచారాన్ని అనుసరించి హృదయం లేని పెదతల్లికీ, పెదతండ్రికీ అప్పగించబడ్డ రోగిష్టి అనాథ ఫకీర్‌మోహన్‌కి, అతని పితామహి ఎంతటి ఆత్మీయురాలో పాఠకులకు విదితమే! ఈమె మరణానికి చాలా ముందుగానే ఆమె మనవడు ఆశించని ఔన్నత్యాలను అందుకున్నాడు. పరాశ్రయురాలైన వృద్ధురాలి త్యాగాలకి విధంగా ప్రతిఫలం లభించటం సంతోషకరమైన సంగతి.

గౌరవనీయమైన ఈ నిరాడంబర మూర్తికి స్మృతిచిహ్నంగా ఆమె మనుమడు ఆమెకొక కావ్యాన్ని అంకితం చేసాడు. తన కథలలోనూ, నవలలలోనూ, స్వార్థత్యాగిణులు, ప్రేమస్వరూపిణులూ అయిన వృద్ధవని తల ప్రశంసనీయమైన పాత్రచిత్రణలో తన పితామహిని పరోక్షంగా ప్రస్తుతించాడు.

# 9

# ఘనత్రయం

గత శతాబ్ది అరవైలలో అప్పుడప్పుడే పైకి వస్తోన్న మేధావులు ముగ్గురు బలాసోర్‌లో కలుసుకుని యావజ్జీవ మిత్రులయ్యారు. వారిలో ప్రతి ఒక్కరూ ఒరియా వాఙ్మయంలో నూతన ప్రక్రియలను ప్రవేశపెట్టారు. వీరిలో రాధానాథ్ రే, మధుసూధనరావులు విశ్వవిద్యాలయంలో సక్రమంగా ఆంగ్లవిద్య నేర్చుకున్నారు. ప్రభుత్వోద్యోగుల కుమారులు కావటంవల్ల వారికి ప్రభుత్వ విద్యాశాఖలో సముచిత స్థానం లభించింది. వాళ్ళిద్దరూ ఉన్నతాధి కారులుగా చెప్పుకోదగిన పెన్షన్‌తో ఉద్యోగ విరమణ కావించారు

త్రయంలో మూడోవాడు మన ఫకీరుమోహన్. కనీసం సరిఅయిన ప్రాథమిక విద్యకాని, భద్రతగల ఉద్యోగంకానీ లేనివాడు. అతనికి జీవితం మనుగడకై సాగిన సుదీర్ఘ సంఘర్షణ. ముగ్గురిలో అతి తక్కువగా చదువు కున్నవాడూ, అండదండలేమాత్రం లేనివాడూ—సాంఘికంగాకాని, వృత్తి వ్యవహారాలలోకాని, చెప్పుకోదగిన పూర్వచరిత్ర లేనివాడూ, అయిన ఫకీర్ మోహన్ మిగిలిన ఇద్దరూ తమ ఆశయాల అత్యున్నత స్థాయిలోకూడా ఊహించలేనంతటి అభ్యుదయాన్ని, తన మేధాసంపత్తితో, ఆత్మబలంతో సాధించాడు ఇలాంటి అసాధారణ విషయాలు మేధావులలో సర్వ సాధారణాలు.

ఒరియా సాహిత్యంలో 1872 వ సంవత్సరం ప్రత్యేకించి పేర్కొన దగినది. ఆ సంవత్సరంలో రాధానాథ్ మధుసూదనులు, బ్రిటిష్‌వారు

స్థాపించిన ఆధునిక పాఠశాలలో ఒరియా వారికి పాఠ్యగ్రంథంగా ఉపకరించటానికై "కబితాబాలి" (కవితలు) అనే పేరుతో ఆధునిక గేయ సంకలనాన్ని వెలువరించారు. ఒరియాభాషలో ఈ భావకవితా సంకలనం, అనాదిగా వస్తున్న పద్యకవితా సంప్రదాయంలో ఒక నూతన యుగాన్ని ప్రవేశపెట్టింది. విశ్వవిద్యాలయాలలో చదువుకున్న ఈ మిత్రులిద్దరూ తాము పరస్పర సహకారంతో వ్రాసిన ఈ పద్యరచనలో ఫకీర్‌మోహన్‌ని పాలు పంచుకోనీయలేదు. 30 సంవత్సరాల వయసుఉన్నా, అప్పటికింకా అతడు కుకవిగానయినా పరిగణింపబడక పోవటమే ఇందుకు కారణం.

సారస్వత ప్రపంచంలో అనుకోని విధంగా మేధావి అయిన వాడెవడయినా ఉంటే, అతడు నిశ్చయంగా ఫకీర్‌మోహన్ సేనాపతి మాత్రమే! చాలాకాలంవరకూ అతడు తెలివిగల అధిక ప్రసంగి మాత్రమే! అతని అంతరాంతరాలలో అణగిన ప్రజ్ఞా పాటవాలు అనుకోని సంఘటనలు ఎదురైనపుడు అసాధారణ శక్తితో మేలుకొని పనిచెయ్యటం ప్రారంభించాయి. మనం ఒక మోస్తరుగా చదువుకున్న కూలిపిల్లవాడు—తెలివైన ఉపాధ్యాయుడుగా - భాషాపండితుడుగా—సమర్థ పరిపాలకుడుగా—ప్రజానాయకుడుగా—ఎలా పరిణమించాడో తెలుసుకున్నాం. ఇప్పుడతడు వైవిధ్యంగల కవిగా రూపొంది "వ్యాసకవి" లేక "నానాజాతి కవి" అనే అసూయజనకమైన బిరుదాలకు అర్హుడయ్యాడు. అతడు తన భాషకందించిన విలువైన కానుకలు, అతడు తరువాతి కాలంలో వ్రాసిన సాటిలేని కథలు, నవలలూ, అయినా, ఒరిస్సాలో ఇప్పటికీ అతనిని వ్యాసకవిగానే వ్యవహరిస్తారు. ఈ మేధావి అసాధారణ వాగ్ధాటినీ, వివిధ సాహితీ ప్రక్రియలను విరివిగా, సునాయాసంగా రచించగలిగే ప్రజ్ఞనూ మెచ్చుకొని "బామ్రా దర్బార్" అతడిని "సరస్వతి" అనే సాహితీ బిరుదంతో సన్మానించింది. అతడు కవిగా—సృజనాత్మక నవలా రచయితగా—నిలవటానికి పరిస్థితులను లెక్కచేయక ప్రతిఘటించి నిలిచే వ్యక్తిత్వమే ప్రధాన కారణం—కూలికుర్రవాడు ఉపాధ్యాయుడిగా రాణించటానికీ—జాతి సముద్ధరణకు పూనుకొన్న నాయకుడు కావటానికీ—పరిపాలకుడు కావటానికీ, కూడా ఈ దృఢ వ్యక్తిత్వమే కారణం.

1872 నుండి ఒక దశాబ్దంవరకూ ఫకీర్‌మోహన్ ఒరియా వచనంలో రెండు గ్రంథాలను మాత్రమే రచించాడు. అవి (1) ఈశ్వరచంద్ర విద్యాసాగరుని బెంగాలీ "జీవన చరిత్ర"కు ఒరియా అనువాదము. (2) భారత

దేశ చరిత్ర— ఈ చరిత్ర పుస్తక రచనకై తాను మూడేండ్లకు పైగా శ్రమించా నని అతడే చెప్పుకున్నాడు. అందుకు తగినట్లుగానే ఆ పుస్తకం ఒరియా పాఠ శాలలతో చాలా సంవత్సరాలు పాఠ్యగ్రంథంగా ఉంది.

అనువాద సాహితీ కారుడు

మరొక పది సంవత్సరాల తరువాత కాని సేనాపతి రచయిత కాలేదు. బలాసోర్‌లో బడిపంతులుగా లభించే శాంతిభద్రతలను వదులుకుని అతడిప్పుడు తీరికలేని ప్రభుత్వోద్యోగిగా ఒక చోటినుండి మరోచోటికి తిరుగాడు తున్నాడు. కొన్ని రోజులు దీర్ఘకాలిక నిరుద్యోగంతో ఆర్థిక దుస్థితి అనుభ వించేవాడు. అంతలోనే ఊహకైనా అందని మంచి ఉద్యోగాలు అందుబాటు లోకి వచ్చేవి.

తన ప్రాణప్రదమైన కృష్ణకుమారి వల్ల కలిగిన మొదటి కొడుకును 'ధేన్‌కనల్' రాష్ట్రానికి 'అసిస్టెంట్ మేనేజరు'గా ఉన్నప్పుడే సేనాపతి పోగొట్టుకున్నాడు. ఆ బిడ్డ మొగశిశువు కావటంవల్లా, చక్కని కనుముక్కు తీరు ఉండటంవల్లా తలిదండ్రులిద్దరికీ ప్రేమపాత్రుడయ్యాడు. ఫకీర్ మోహన్‌కి మొదటి భార్యవల్ల ఒక కూతురు మాత్రమే కలిగింది. అంచేత అతని ప్రథమ పుత్రుని అకాలమరణం తలిదండ్రులకు మరింత దుఃఖకారణ మయింది. ఆ శిశువు ఆరునెలలపాటు తన పసితనపు చిలిపిచేష్టలతో వారి మనసులను సంపూర్ణంగా ఆకట్టుకున్నాడు. ఈ విషాదం తండ్రి నెంతో క్షోభ పెట్టింది. కానీ, కృష్ణకుమారి మాత్రం క్రుంగిపోయింది. తన ఇల్లాలు తొలి సారిగా అనుభవిస్తోన్న ఈ దుర్భరావేదనను తొలగించటానికే, తీరికలేని ప్రభుత్వోద్యోగి ఫకీర్ మోహన్ తన గృహసీమలో కవి కావాలని ప్రయ త్నించాడు.

ఫకీర్ మోహన్ అదృష్టంకొద్దీ కృష్ణకుమారి పవిత్రమైన మత విశ్వా సాలు కలిగిన వ్యక్తి. మతవిశ్వాసాలతో కూడిన ఈ మనస్తత్వమే, విద్యా విహీనురాలయిన ఈ యువతి రెండు దశాబ్దులకాలం మేధావియైన తన భర్తకు తనను తాను సంపూర్ణంగా అంకితం చేసుకోవటానికి ప్రధాన కారణం.

తండ్రీ కొడుకుల అనుబంధాన్ని రామాయణంకంటె గొప్పగా వర్ణించే కావ్యమేదీలేదు. లక్షలాది తలిదండ్రులు దశరథుడు రాముడికోసం కార్చిన

వేడి కన్నీటితో క్షోభించిపోతున్న తమ ఆత్మలను తాత్కాలికంగా శాంతింప చేసుకునేవారు. కాని, ఆ తరువాత వెంటనే భరించలేని బాధకి లోనయ్యే వారు - కృష్ణకుమారి పుత్రశోకాన్ని మరపించటానికి రామాయణ కావ్య శ్రవణమే మంచి మార్గంగా భావించి ఫకీర్ మోహన్ ఒక బ్రాహ్మణ పూజారిని ప్రతిరోజూ ఆమెకు బలరామదాసుని ఒరియా రామాయణాన్ని చదివి వినిపించ మని కోరాడు. త్వరత్వరగా మంత్రాలు చదువుతున్నట్లుగా చదవటంవల్ల కాబోలు, అసలే బాధపడుతోన్న కృష్ణకుమారికి, చదువుతున్నది అర్థం కాకుండా పోయింది. ఆ కారణంచేత ఆ ఏర్పాటు మానిపించవలసి వచ్చింది. ఆ తరువాత ఫకీర్ మోహన్ సాహసించి తానే వాల్మీకి సంస్కృత రామాయ ణాన్ని సులభశైలిలో ఒరియా పద్యాలుగా అనువదించటం మొదలుపెట్టాడు. ప్రతిరోజూ సాయంత్రం తన భార్యకు ఆరోజు తాను అనువదించిన భాగాన్ని వినిపించేవాడు. ఇది చక్కగా సాగింది. ఫకీర్ మోహన్ వ్రాసిన ప్రతి పద్యమూ సుస్పష్టంగా ఉండేది. అంతగా చదువుకోని కృష్ణకుమారికికూడా ప్రతి విషయమూ చక్కగా బోధపడేది. ఆధునిక హిందూ వాఙ్మయంలో దాదాపు తొలిసారిగా సామాన్యుని భావాలకు ప్రాతినిధ్యం వహించిన ఈ ప్రముఖ సాహితీవేత్తకు, చదువు సంధ్యలు లేని నిరాడంబరురాలైన తన ఇల్లాలే, మొట్టమొదటి శ్రోత, విమర్శకురాలు, కావటం సమంజసంగానే ఉంది.

రామాయణరచనలో ఫకీర్ మోహన్ ఒక అధ్యాయం నుండి మరొక అధ్యాయానికీ, ఒక ఘట్టం నుండి మరోఘట్టానికీ సాగుతున్నప్పుడు, మహా పురుషుడైన తన భర్త పెదవుల కదలికను గమనిస్తూ కృష్ణకుమారి మౌన ప్రతిమలా కూర్చుండిపోయేది. శ్రీరాముని అరణ్యవాసఘట్టంలో ఆమెకు కన్నీరు కాలువలు కట్టేది. ఫకీర్ మోహన్ రామాయణానువాదంలో మొదటి భాగం అచ్చయి రాగానే, కృష్ణకుమారి ఆ పుస్తకాన్ని ప్రేమతో చేత్తో పట్టుకుని చెమ్మగిల్లిన కళ్ళతో ఇలా అంది- "మనము పోగొట్టుకున్న శిశువు కోసం ఇంకా ఎందుకు విచారించాలి? తమ జ్ఞాపకాలు ఈ లోకంలో సజీవంగా నిలిచిపోవటానికేగదా, అందరూ సంతానం కోరుకునేది! కానీ, ఆ జ్ఞాపకాలన్నీ చాలా కొద్దికాలానికే తుడిచిపెట్టుకుపోతాయి. మన ఈ బిడ్డ (ఈ గ్రంథం) మన పేరు చిరస్థాయిగా నిలుపుతుంది!"

తన భార్య ప్రశంసలవల్ల లభించిన ప్రోత్సాహంతో ఫకీర్ మోహన్ త్వరలోనే రామాయణాన్ని పూర్తిగా అనువదించాడు. రామాయణం తరువాత

తన భార్యకొరకే మహాభారతానువాదాన్ని కూడా తలపెట్టాడు. గత శతాబ్దపు చివరి దశాబ్దానికి అతడు ఈ బృహత్కార్యాన్ని కూడా పరిసమాప్తి చేసాడు.

ఆయన రచనా పాటవంవల్ల రామాయణ మహాభారతానువాదాలు రెండింటికీ ఒరిస్సా ప్రాంతమంతటా, అఖండకీర్తి లభించింది. అప్పటికే రామాయణ భారతాల ఒరిస్సా అనువాదాలనేకం ఉన్నా—మూలానికి సన్నిహితంగా—ధారాశుద్ధితో—సరళశైలిలో ఉన్న ఫకీర్‌మోహన్ అనువాదాల వంటివి లేవు. ఒరియా రామాయణ భారతానువాదాలలో ఫకీర్‌మోహన్‌వే మొదటిసారిగా ప్రసిద్ధిపొందిన రచనలు ఒక దుఃఖితురాలికేకాక మొత్తం జాతికీ ఆత్మానందాన్ని కలిగించిన రచనలవి.

జాతి ఆధ్యాత్మికాభివృద్ధికై ముఖ్యమైన ఉపనిషత్తులన్నీ పద్యరూపంలో ఒరియాలోకి అనువదించే బాధ్యతను ఫకీర్‌మోహన్ తనకు తానుగా పైనవేసుకొన్నాడు—ఈ రకమైన ప్రయత్నాని కతడే ప్రథముడు. వేదాంతాలలోని క్లిష్టమైన ఆధ్యాత్మికత ఫకీర్‌మోహన్ అనువాదంలో సరళసుందరంగా ఒదిగిపోయింది. ఆ కారణంచేత ఫకీర్‌మోహన్ ఉపనిషత్తుల అనువాదం, కేవలం అనువాదంకాక, మనము ఇంతకుముందు వర్ణించుకొన్నట్లుగా అనువాద సాహిత్య మవుతుంది.

రామాయణ మహాభారతాలను, ఉపనిషత్తులను, ఒక వ్యక్తి మాత్రమే అనువదించటం ఆశ్చర్యకరమే! పైగా అతడు అసాధారణ పరిస్థితులను, దుష్టశక్తులను ఎదుర్కోవలసిన ప్రభుత్వోద్యోగి కూడా అయినపుడు వారకులు నిశ్చేష్టులవుతారేమో ! ఏదో దైవిక ప్రేరణ ఉంటేతప్ప ఇంతటి ఆశ్చర్యకరమైన శారీరక మానసిక సాధనలు మానవమాత్రునికసాధ్యం. ఫకీర్‌మోహన్ ఉత్తేజితుడు. అతని ఒరియా పద్యానువాదాలు విస్తృతమైనవి - తన భాషనభివృద్ధిపొందించాలనే ఆశయమే దీనికంతకూ పరోక్ష ప్రేరణ కావచ్చును. ఫకీర్‌మోహన్ కృషినిమించి మరి ఏ ఒక్కరికృషీ ఒరియాభాషను అంతగా వృద్ధి చేయలేదు.

## మొట్టమొదటి సృజనాత్మక రచన

అతని మొట్టమొదటి స్వతంత్ర రచన 'ఉత్కలభ్రమణం' (Travels in Orissa) అతని మేధావంతమైన కల్పనకు మరో నిదర్శనమే

కాదు. పాతపద్ధతులను మార్చివేయాలన్న కోరికకు రూపకల్పన కూడ ! అతని అనువాదాలు ప్రచురింపబడిన సమయంలో ఇది కూడా ప్రచురింపబడింది. వెనుకటి అధ్యాయంలో వివరింపబడిన భుయాన్ విప్లవ సమస్యల నుండి ఫకీర్‌మోహన్ అప్పుడే బయటపడ్డాడు. విప్లవ సందర్భంలో కియోన్‌ఝూర్‌కి వచ్చిన బ్రిటిష్ రాజకీయాధికారులకు బలాసోర్ జిల్లాలోని భద్రక్ పట్టణంలో వీడ్కోలు చెప్పి ఫకీర్‌మోహన్ ఆనంద పూర్‌లోని తన అధికార ప్రధాన కార్యాలయానికి ఏనుగుమీద వస్తు న్నాడు. అప్పుడతనికి ఆకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టింది. సమకాలిక ఒరిస్సా వైభవాన్ని పద్యకావ్యంగా రచిస్తే బాగుంటుందని అనుకున్నాడు. ఈ ఆలోచన వచ్చినవెంటనే అతడు ఏనుగుమీద అటూ ఇటూ ఊగుతూనే జేబులో నుండి పుస్తకమూ పెన్సిలూ తీసి వ్రాయటం మొదలుపెట్టాడు. ఆనందపురం చేరేసరికి సగం పూర్తయింది. మూడవరోజు ముగిసేసరికి అది అచ్చయి వచ్చేసింది.

ఈ వ్యంగ్యకావ్యం ఇప్పటికీ ఒరియా సాహిత్యంలో సాటిలేనిదిగా నిలిచిపోయింది. దానిని మళ్లీ ఇంకెవ్వరూ వ్రాయలేదు. ఫకీర్‌మోహన్ వంటివారుతప్ప మరొకరెవరూ ఈ విధమయిన సాంఘిక - రాజకీయ కావ్యాన్ని వ్రాయటానికి సాహసించలేరు. ఈ రచయితకు తెలిసినంతవరకూ దీనితో సమానమైన రచన బెంగాలీలోగానీ, హిందీలోగానీ లేదు. అందుచేత సేనాపతి 'ఉత్కళభ్రమణం' ఈనాటికీ సాటిలేని స్వతంత్ర రచనగా పరిగణింపబడుతోంది.

ఒరిస్సా అంతటా ఈ పుస్తకం సంచలనాన్ని కలిగించింది. దీనిలోని సమకాలీన వ్యక్తిత్వాల వర్ణనలతో, సజీవమైన పలుకుబడులతో, హాస్యాన్ని గుమ్మరిస్తూ వ్యంగ్యంగా సాగిపోయే రచన పాఠకులను కడుపుబ్బ నవ్వి స్తుంది. జగన్నాథ దేవాలయంచుట్టూ మూగే చదువురాని 'పండా'లనూ, బ్రాహ్మణులనూ - కొద్దిగా ఇంగ్లీషు చదువుకున్నంతమాత్రాన తమభాషనూ, తమ సంస్కృతినీ నిరసించుకొంటూ, మంచి హిందువుగా ఉండటంకంటె, చెడిపోయిన ఇంగ్లీష్‌వాడిగా ఉండటానికే ప్రయత్నించే "బాబూ" లనూ అతడు నిశితంగా విమర్శించాడు. ఆలోచనలేని ఈ రకమైన కోతులను విమర్శిస్తున్నప్పుడు, అతడు చదువుకున్నామని భావించే ఈ బాబూలను సూక్ష్మంగా పరిశీలించాడు. అప్పుడతనికి ఈ రకమైన కోతులవంటి భారతీ

యులను గమనించినప్పుడే, ఛార్లెస్‌డార్విన్‌కి మానవుడు కోతినుండి వచ్చాడనే ఆలోచన వచ్చిఉంటుందని తోచింది. ఆంగ్లభాష మైకంలో ఇంగ్లీషులో మిడిమిడిజ్ఞానం సంపాదించి తమ మాతృభాషను నిరసించేవారిని గురించి అతడిలా అంటాడు. "చెత్తకుండీలలో విసిరిపారేసిన ఎంగిలాకులు నాకి పొట్ట పింపుకునే కుక్కకి సొంత ఇల్లు కావాలనే ఆరాటం ఎందుకుంటుంది?"

వ్యంగ్య, హాస్య రచన అయిన "ఉత్కలభ్రమణం" ప్రచురింపబడిన రెండేళ్ళ తరువాత తన భర్తను, ఒంటరిగా, నిస్సహాయునిగా, భగ్నహృదయునిగా వదలి కృష్ణకుమారి చనిపోయింది. ఈ దుర్భరావేదనే, అప్పటివరకూ అనువాదకవిగా – సుస్మిత హాస్యకవిగా – ఉన్న అతడు సమర్థుడైన సృజనాత్మక కవి కావటానికి దారితీసింది. తన వ్యక్తిత్వంలోని నూతనాభివృద్ధిని గూర్చి అతని మాటలు :

"కవిత్వం వ్రాసే అలవాటు కలగటం నాకొక గొప్పవరం. నిజానికి నా శ్రీమతికి నేను చాలా ఋణపడి ఉన్నాను. నా కవితలను విని ఆవిడ ఎంతో ఆనందించేది. అందుచేత ఆవిడను ఆనందింపచేయటానికే కవితలు వ్రాసేవాడిని – ఆ అలవాటు ఆమె మరణానంతరం అశాంతితో అలమటించే నా మనసుకు ఊరటకలిగిస్తూ కొనసాగింది. ప్రతి దినమూ ప్రభాత స్నానానంతరం కృష్ణకుమారి నా రామాయణ భారతాల నుండి కొన్ని అధ్యాయాలను పఠించేది. ఆవిడ మరణించిన తరువాత దుర్భర మనస్సంక్షోభాన్ని అనుభవిస్తున్నప్పుడూ, దురదృష్టం వరించినప్పుడూ, ఎడతెగని బాధలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడూ పలాయన సాధనంగా పద్యాలు వ్రాసేవాడిని."

## అత్యున్నతమైన విశ్వజనీనత

ఫలితంగా ఈనాడాయన పద్యాలు కోట్లసంఖ్యలో కనిపిస్తున్నాయి. వస్తువులోని వైవిధ్యం అద్భుతావహం. ఒరియా సాహిత్యంలో అతనికి అనన్యసామాన్యస్థానం సంపాదించిపెట్టిన అతని కల్పనాసాహిత్యంకంటె ఈ పద్యాలే అతనిని వ్యక్తిత్వంలోని నిండుదనాన్నీ ఔన్నత్యాన్నీ వ్యక్తం చేస్తున్నాయి. అసంఖ్యాకమైన ఈముక్తకాలలో, ఉన్నతమూ, ఉదాత్తమూ, అయిన ప్రతి అంశానికి స్పందించే విశ్వకవి సాక్షాత్కరిస్తున్నాడు.

అతని హృదయంలోని ఉదాత్తమైన విశ్వజనీనతకు ఉదాహరణగా అనుపమానమయిన "స్వర్గద్వారం ముందున్న ఆత్మలు" అనే కవితను పేర్కొనవచ్చు.

ఈ లోకం వదిలిన ప్రతి ఆత్మా, స్వర్గద్వారంవద్ద లోనికి ప్రవేశించ బోయేముందు చతురుడైన ద్వారపాలకుణ్ణి తన దృక్పథం ఏదో ఒక ప్రత్యేక మతానికి చెందిన మూఢాచారాలను గుడ్డిగా అనుసరించటంకాదనీ, మొత్తం మానవాళీకానికంతకూ సంబంధించినదనీ సమ్మతింప చేయాలి.

మొట్టమొదట స్వర్గ ద్వారపాలకుడు "ముస్లిమ్ భక్తుడు" అని భూలోకంలో పేరుతెచ్చుకున్న ఆత్మని కలుసుకున్నాడు ఆ ఆత్మ తాను నియతితప్పక రోజుకు అయిదుసార్లు "నమాజు" చేసేవాడిననీ, రంజాన్ రోజులలో కరినోపవాస వ్రతాన్ని పాలించేవాడననీ, అల్లాదూత అయిన మహమ్మద్‌ను తప్ప మరెవరినీ విశ్వసించనివాడననీ ప్రగల్భాలు చెప్పు కొన్నాడు. "కానీ, నీవెప్పుడైనా, తదితర దేవదూతలైన మోజెస్, బుద్ధుడు, క్రీస్తు, మొదలైనవారి ఆశీస్సులు పొందటానికి ప్రయత్నించావా?" అని దివ్యుడైన ఆ ద్వారపాలకుడు ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు మూఢాచారపరు డైన ముస్లిం "ఆ పని నేనెలా చెయ్యగలను? వారంతా "కాఫిర్లు కదూ!" అన్నాడు. అప్పుడా స్వర్గద్వారపాలకుడు భగవానుని రాజ్యంలో నీబోటివారికి స్థానంలేదని ఖండితంగా చెపుతాడు. ఆ తర్వాత అలాంటి మూఢవిశ్వాసాలు కలవాడే, ఒక వైష్ణవుడు వచ్చాడు. అతడు తన మెడలోని తులసిపూసల మాలగురించీ తన నిరంతర భగవన్నామ జపంగురించీ గర్వంగా చెప్పుకొన్నాడు ఆ స్వర్గ ద్వారపాలకుడు ఆ వైష్ణవుని తులసిమాలాలం కృతమైన కంఠమూ, సగము బోడిగుండు, శాలువ కప్పుకొన్న శరీరమూ, భూలోకంలోనే బూడిద అయిపోయాయని అన్నాడు. భూలోకంలో ఉండగా దేవదూతలైన బుద్ధుడు, జీసస్, మహమ్మద్‌లను నిరక్ష్యం చెయ్యటంవల్ల అతనికి కూడా భగవానుని రాజ్యంలో స్థానం లేదన్నాడు. ఇతర మతాలకు చెందినవారు కూడా ఈ విధంగానే ప్రశ్నించ బడ్డారు. ఏ ఒక్కరిలోనూ స్వర్గప్రవేశార్హత కనిపించలేదు. చివరికా స్వర్గ ద్వారపాలకుడు భూలోకంలోని మతతత్వ సారాంశాల సత్యాన్ని ఇలా ఉపదేశిస్తాడు "మానవాళికి ప్రధానమైన ధర్మాలను ప్రబోధించటానికై దేవుడనేకమంది దూతలను భూలోకానికి పంపాడు. బుద్ధుడు జ్ఞానవైరాగ్యా

లను, జీసస్ ప్రేమను, మహమ్మద్ విశ్వాసాన్ని బోధించారు. వారంతా మానవాళికంతటికీ ఆరాధ్యులైన దేవదూతలు. ప్రేమ విశ్వాసాలూ, భక్తి వైరాగ్యాలూ మాత్రమే ఆత్మకు స్వర్గలోక ప్రవేశాన్ని కల్పించగలవు. బాహ్యాచారాలూ, పరస్పర ద్వేషాలూ, ఆత్మకు ముక్తి నీయలేవు. తోటివ్యక్తిని తనకంటే భిన్నుడిగా భావించేవానికి సముచితస్థానం స్వర్గంలోకాదు, నరకంలో!

లోకజ్ఞత

ఫకీర్ మోహన్ కవిమిత్రులైన రాధానాథ్ మధుసూదనులు కవితాత్మక మైన వస్తువును మాత్రమే స్వీకరించేవారు. అంతగా బడిచదువులేని ఫకీర్ మోహన్ మనోభావనలు పండిత సంప్రదాయాలచే ప్రభావితం కాలేదు. గ్రంథాలద్వారాకాని, గురువులనుండి నేర్చుకొనికాని, సాహిత్యాధ్యయనంచేసే అవకాశమే అతనికి రాలేదు. ఆ కారణంచేత తనకు వచ్చిన ఆలోచనలనూ, భావాలనూ, కలిగిన అనుభూతులనూ, అత్యంతసహజంగా వ్యక్తీకరించేవాడు. సులభగ్రాహ్యత అతని ధ్యేయం. పాండిత్యప్రకర్ష కతడు ప్రాధాన్యం ఈయ లేదు. వికసించే అతని మేధ ఎప్పటికప్పుడు తన పాఠకులకూ సమకాలిక జీవితంనుండి ఏదో ఒక సందేశం అందివ్వటానికి సంసిద్ధంగా ఉండేది. మనలో చాలామందిలాగకాక, సత్యాన్నీ, ధర్మాన్నీ, న్యాయాన్నీ నిర్భ యంగా చాటిచెప్పే ధీరత్వం అతనికి ఉంది. దానివలన వచ్చే పరిణామాలను అతడు లక్ష్యపెట్టేవాడు కాదు. "గయ్యాళి కవిపత్ని" నుండి పతిపరిత్యక్త జోసెఫిన్ కన్నీటివరకూ; లేక కర్షకుని కష్టగాథలనుండీ బాల్యవితంతువు బాధలవరకూ అతని ఇతివృత్తాలలో వైవిధ్యం ఉండేది. జపాన్ సాధించిన వినూత్న విజయాలనతడు తన పద్యాలలో ప్రస్తుతించాడు. వాటిని తన దేశీయులకు ఉదాహరణగా చూపాడు. జపానునుండి తేబడినదిగా భావింపబడు తోన్న "హస్నహేన" (husnahena) పుష్పసుకుమార సౌరభాలను వర్ణిస్తూ మనసారా గానం చేసాడు. జపానీయుల సంస్కృతి, క్రమశిక్షణ, తాత్వికదృక్పథమూ అతడిని ముగ్ధుణ్ణి చేసాయి - పండుముసలి వయసులో సహితం "సూర్యుడుదయించే ఆ భూమికి" ప్రయాణం కావాలనుకున్నాడు. భారతదేశమే పతివ్రతలకు నిలయమనే అహంకారాన్ని అణచటానికి కాబోలు, అతడు రోమను సతి లూక్రిషియా (Lucretia) పాతివ్రత్యాన్ని

వర్ణిస్తూ ఒక కావ్యం వ్రాసాడు. క్లియోపాత్రాగురించి కూడా అలాంటికావ్యమే వ్రాసాడు. ఎంతటి విచక్షణగల పురుషులనయినా, తమ కడగంటి చూపులతో కట్టిపడవేయగల సుందరీమణులమాలాన ఒకప్పుడెంతో శక్తిమంతులైన "టాలెమీ"లు (Ptolemis) "టార్క్విన్‌లు" (Tarquins) సంపూర్ణంగా తుడిచిపెట్టుకుపోయారనే చారిత్రక సత్యాన్ని ఈ కథానాయికలిరువురి జీవిత చరిత్రలద్వారా ఆవిష్కరిస్తున్నాడు. ఫకీర్‌మోహన్ శ్రీకృష్ణుడు, జీసస్ క్రీస్తు, తుకారామ్ మొదలైన వారిపై పద్యాలు వ్రాసాడు. "ఎండిపోయిన పలాసవృక్షము"; "జంటపావురాలు"; రాలిపోబోయే ఎండుటాకు చివరి ప్రతిబింబము"; మొదలైన కవితలు కూడా వ్రాసాడు.

## నిరాడంబర యువతికై కన్నీరు

పురాణాలు, ఉపనిషత్తులు, అన్నిరకాల అంశాలపైనా, అంతులేనన్ని కవితలూగల ఫకీర్‌మోహన్ పద్యప్రపంచంలో, అతడు తన పితామహి కొరకూ, ప్రియమైన ఇల్లాలు కృష్ణకుమారికొరకూ పరితపిస్తూ వ్రాసిన పద్యాలే పాఠకులను అమితంగా కదిలిస్తాయి. అవ్యక్తమైన అతని ఆత్మ సంగీతం అందరి హృదయాలలోనూ ప్రతిధ్వనిస్తుంది. కృష్ణకుమారికి అంకితంగా వ్రాసిన "పుష్పమాల" లోని పద్యాలు ప్రపంచంలోని ఏప్రాంతంలో నయినా నిజమైన ప్రేమికుల హృదయాలను రసార్ద్రం చేస్తాయి.

కొన్ని మొదటి పంక్తులు:
సుందరి కృష్ణకుమారి
నా జీర్ణకుటీరానికి రాణీ –
నా ప్రాణసఖి – నన్నొదలాయని ప్రేయసి
నా తోడునీడ – నా కంటివెలుగు
నీ ఎడబాటుతో –
నీ సద్గుణాలన్నీ –
నా అణువణువునా లీనమయ్యాయి –
నిన్ను మించిన సతీలలామ,
లేదు నాకు, ఈ జీవితంలో,
నీకంటె మిన్నగా మరెవ్వరూ,

ప్రాణపతి కల్పితులు కాలేరు.
వినీలాకాశంలోని
పూర్ణచంద్రుని సౌందర్యమూ;
నవవికసిత పద్మాలపై, గులాబులపై,
మెరిసే మంచు ముత్యాలూ;
దివ్యలలో కలిసిన నీ కనులు వర్షించే
కన్నీటిముందు వెలతెలపోతాయి.
నీ వదన ప్రశాంత సౌందర్యమ్మే,
విశ్వాంతరాళాల వ్యాపించినదేమోనని
విభ్రాంతి పొందుతున్నాను.

ప్రశాంత నిశాంత సమయాన,
మేడపైనో,
తోటలోనో,
మనమిద్దరమే,
దివ్యకాంతులు అన్నివైపులా వెదజల్లుతూ
ఆకాశాన అల్లనల్లన తేలియాడే
తారాచంద్రులను తన్మయత్వంతో చూస్తున్నప్పుడు -
ఆ మధురక్షణాలలో,
మనం సహితం -
పైన మెరిసే చుక్కలలాగే
జంటచుక్కలమని
అనుకున్నాను!
అవును, కదూ!

"నన్ను దుఃఖసముద్రంలో ముంచి ఆమె చిరునవ్వులతో వెళ్లిపోయింది." "ఆ నగుమోమును తిరిగి చూడగలనా?" "నా ప్రియురాలు లేని వెలితిని ఎవరు పూరించగలరు?" అనే పద్యాలు పరితప్త హృదయపు లోతులనుండి వచ్చిన ఉద్వేగపు పొంగులు. ఉన్నత కవితాహృదయం కల్ల

వాడే తన ప్రియురాలి పాదాలముందు ఈ రకమైన ప్రణయగానాన్ని వినిపించగలడు.

## బౌద్ధ పురాణ గాథలు

సర్వమత సమన్వయంగల ఫకీర్ మోహన్ హృదయం బౌద్ధం వైపు ఆకర్షింపబడటంలో ఆశ్చర్యం లేదు. ఒరియా వాఙ్మయానికి ఎన్నెన్ని ప్రక్రియలనో, మొదటిసారిగా అందించినట్లుగానే, బౌద్ధమతానికి సంబంధించిన మొట్టమొదటి పుస్తకం కూడా అందించాడు. అ బౌద్ధపురాణంలో బుద్ధుని జీవిత చరిత్ర, అతని ఉదారాశయాలూ ఉన్నాయి. సుదీర్ఘమూ, సమగ్రమూ అయిన పీఠిక కూడా ఉంది. అర్ధశతాబ్ది గడిచినా, ఆ పుస్తకానికి తగిన గుర్తింపు రాలేదు. అశ్వఘోషుని "బుద్ధచరిత", కర్తృత్వం తెలియని "లలిత విస్తారం", విశ్వవిఖ్యాతి పొందిన సర్ యెడ్విన్ ఆర్నాల్డ్‌గారి "లైట్ ఆఫ్ ఏసియా" – మొదలైన రచనలవలె ఇతని "బౌద్ధావతార కావ్యా"న్ని స్వతంత్ర రచన అనటానికి వీలు లేదు. అనేక ఒరియా కావ్యాలవలె ఈ కావ్యం కూడా అనేక కట్టుకథలతో నిండినదైనా, వివిధ ఛందోరీతులలో నడిచి చారిత్రక విశ్వపురుషుణ్ని అభివర్ణిస్తూ జీవితంపట్లా, మతంపట్లా ఒక తాత్త్విక దృక్పథాన్ని ప్రదర్శించటంవల్ల నిశ్చయంగా కొత్తబాట వేసిందనే అనుకోవాలి.

## గయ్యాళి భార్య

"కవిగారి గయ్యాళిభార్య" అనే అతని పద్యకావ్యంలో, కవులకు భార్యలై, ఎల్లప్పుడూ అసంతృప్తితో కుమిలే, దురదృష్టవంతులైన స్త్రీల బాధలు ప్రతిధ్వనిస్తాయి. అంతే కాదు. అన్ని దేశాలలోనూ, అన్నికాలాల లోనూ, సరస్వతీ పుత్రులనుభవించే దుర్భర దారిద్ర్యం కూడా కనిపిస్తుంది. ఆ కవితలోని కొన్ని పంక్తులకంటె ఈ అధ్యాయానికి మరొక మంచి ముగింపు ఉండదు. "కవితో కవిపత్ని ఇలా అంటుంది –" "ఈ ఇల్లు అనబడేది ఎంతటి శిథిలావస్థలో ఉందో మీ కళ్లకు కనబడటం లేదా? పొయ్యిమీద కుండ ఎక్కించటానికి నాలుగు డబ్బులైనా తెచ్చిపెట్టలేని, ఆ వర్గాలూ, ఛందాలూ, తాళాలూ, అంటూ రాత్రింబగళ్లు వాటిలో మునిగితేలుతూ, నేను ఎంత ఏడ్చిమొత్తుకున్నా, నా గోల పెడచెవిని

పెట్టటానికి మీకెంత సాహసం? వ్రాయడానికి ఏదైతేదని నేనెప్పుడూ అంటున్నా, ఎందుకా పిచ్చివ్రాతలు వ్రాస్తున్నారు? మన చుట్టుప్రక్కల వారంతా మరెన్నో తెలివైన మార్గాలలో ధనధాన్యాలూ, వస్తువాహనాలూ, సంపాదించుకోవటం కళ్ళకి కనబడటంలేదా? అదంతా మీరు చూడలేకపోతే మీకసలు బుర్రంటూ ఉందా? ఈ దిక్కుమాలిన పద్యాలు ఎవడికి కావాలో చెప్పండి, దయచేసి? ఈ పిచ్చిపిచ్చి పద్యాలు వ్రాసేవ్యసనంలోంచి బయట పడమని చెప్పిచెప్పి నా ప్రాణాలు పోతున్నాయి. అప్పులవాడు నిన్ననే వచ్చి నా ముఖంముందే చివరిసారిగా బెదిరించి పోయాడని తెలుసుకోండి, కాస్త! ఇంకా మీరలా ఓమూలకూచుని ఆ పాడుపద్యాలెలా వ్రాసుకుంటున్నారో, నా ఊహకందటం లేదు!''

# 10

# ఒక మహానిర్మాత ఆవిర్భావము

ఒరియా కల్పనాసాహిత్యాన్ని ప్రారంభించినవాడు, ఆ సాహిత్యంలో ప్రముఖుడూ, అని ఒరియా అంతటా ఫకీర్ మోహన్ గౌరవింపబడేవాడు. కానీ, అయిదు పదులు దాటేవరకూ, ఈ ప్రత్యేకమైన ప్రతిభ తనలో ఉన్నదన్న పరిజ్ఞానమే అతనికిలేదు. చాలాకాలంవరకూ అతడు తన భావాలు పద్యం ద్వారానే వ్యక్తపరచేవాడు. అతడు గద్యంకాని, కథలుకాని, వ్రాయలేదని కాదు. అతడు కొద్దిపాటి జీతం తెచ్చుకునే బడిపంతులుగా ఉన్నప్పుడే, అతడు బలాసోర్‌లో ఒక అచ్చుయంత్రం స్థాపించి, సాంఘిక దురాచారాలను ఖండిస్తూ, తన ఆధునిక భావాలు ప్రచారంచెయ్యటానికి, పత్రికలు కూడా ప్రచురించేవాడని, మనం తెలుసుకున్నాం.

ఆ రోజులలో బెంగాలీ పత్రికల* ప్రాచుర్యానికి కథలు ప్రధాన కారణ మని గ్రహించి, అతడు ఆసాహితీ ప్రక్రియలోకూడా సాధన ప్రారంభించాడు. గతశతాబ్ది అరవైలలో బహుశః మొట్టమొదటి ఆధునిక ఒరియా కథను,

''బోధదాయిని'' అనే తన సారస్వత పత్రికలో ప్రచురించాడు. దాని పేరు ''లచ్ఛమన్య'' (Lachhamania). కాని అది ఇప్పుడు లభ్యం కావటంలేదు.

1871 నుండి 1896 వ సంవత్సరంవరకూ పాతికేళ్లు ఫకీర్‌మోహన్ తీరికలేని పాలనాధికారిగానో, లేక ఆర్థిక స్తోమత లేని నిరుద్యోగిగానో, ఉండి పోయాడు. అతడు రోగగ్రస్తుడు కూడా! సేనాపతి ప్రెస్, దాని స్థాపకుడు బలాసోర్ పట్టణాన్ని విడిచి సదవకాశాలకోసం విశాల విశ్వంలోకి ప్రయాణం కావటానికిముందే, మూసివేయబడింది. అతడు ప్రారంభించిన పత్రికలు మరొకరికప్పగించబడ్డాయి – కానీ, త్వరలోనే అన్నీ ఆగిపోయాయి.

అతడు బలాసోర్ వదిలిన పాతిక సంవత్సరాలలోనూ లచ్ఛమన్య వంటి మరోకథ రాలేదు – అనేక సంఘటనలచేతా, సన్నివేశాలచేతా, ప్రేరితుడై వ్రాసిన పద్యాలు మాత్రం చాలా ఉన్నాయి – ఆ విషయం మనం చర్చించాము.

ఫకీర్‌మోహన్ నిలకడలేని పరిపాలనాధికార ఉద్యోగాలనుండి విరమించుకున్నాక కటక్‌లోని కొత్తపద్ధతులలో కట్టిన ''గార్డెన్ - హౌస్'' (Garden - house) లో స్థిరపడ్డాడు ఆ సమయంలో ఒరిస్సా సాహిత్యక త్రయమైన ఫకీర్‌మోహన్, రాధానాథ్, మధుసూదనులకు మిత్రుడూ, ఒరిస్సాలోని ప్రముఖ సంపాదకుడూ అయిన విశ్వనాథకర్ ''ఉత్కల సాహిత్య – '' అనే ఒరియా మాసపత్రికను కటక్‌నుండి వెలువరించేవాడు. తానందించే సాహిత్యం అందరినీ ఆకర్షించటానికి విశ్వనాథ్ అన్నివైపుల నుండీ, కథలను ఆహ్వానించేవాడు. ఫకీర్‌మోహన్‌నికూడా ప్రయత్నించమని అతడు కోరాడు. ఇదే, అద్భుతంగా నిద్రాణంగా ఉన్న ఒక మహాపురుషుణ్ణి మేల్కొలిపింది.

అప్పటినుండి, 1918 లో మరణించేవరకూ, ఫకీర్‌మోహన్, కథలూ, నవలలూ, వ్రాస్తూనే ఉన్నాడు. ఆ రకమైన రచనలు చిన్న వయసులో చేసి ఉంటే, ఎవరికైనా, ఎంతో లాభించి ఉండేది. సాహిత్యంలో అనన్య సామాన్యమైన కథల నాతడు సృష్టించింది, బాగా పెద్ద వయసులో! కుటుంబ సభ్యుల కృతజ్ఞతా పూర్వకమైన గౌరవాదరణలను ఆశించే, ఆ విశ్రాంతి దినాలలో, అతడు తన గృహజీవితంలో దారుణమైన అశాంతిని అనుభవించవలసి వచ్చింది. కనీసం కటక్‌లోని స్నేహితులతోనూ, సాటి

ఉద్యోగులతోనూ, సాహితీ స్పర్ధలైనా అతనికి తప్పలేదు. కొడుకూ—కోడలూ రావటంతో ఆ కుటుంబ పెద్దతానెంతో అనువుగా నిర్మించుకొన్న కటక్‌లోని తోట బంగళాను వదలి, బలాసోర్‌లో పది సంవత్సరాలు ఒంటరిగా గడప వలసి వచ్చింది. అదృష్టవశాత్తూ అక్కడ కూడా అతడొక ఇల్లు కట్టు కున్నాడు. అశాంతిమయమయిన అతడి ఏకాకి రోగిష్టి వృద్ధాప్యపు దినాలలో అతడు రచించిన గద్యపద్య ఆ రచనలన్నీ, కటక్‌లోనూ, బలాసోర్‌లోనూ ఉన్న ఈ రెండు గృహాలలోనూ రచించాడు. ఇది ప్రధానంగా ఆనాటి ప్రముఖ సాహితీ మాస పత్రికలైన "ఉత్కల సాహిత్య" "ముకుర" సంపాదకుల అభ్యర్థనలపై రచించినవే !

## అతడు ప్రజల భాషలో రచించాడు

ఫకీర్‌మోహన్ కథారచన మొదలుపెట్టే నాటికి బెంగాలులో గద్య రచనలు కొన్నాళ్లు వెలిగి ఆరిపోయాయి. పియరే చంద్రమిత్ర, (Peary Chandra Mitra) అక్షయకుమార్ దత్తా, (Akshoyakumar Dutta) ఈశ్వర చంద్ర విద్యాసాగర్, (Iswar Chandra Vidyasagar) భూదేవ్ ముఖర్జీ, (Bhudeb Mookerjee) బంకించంద్ర, (Bankim Chandra) మొదలైనవారంతా మరణించారు. ఈ బెంగాలీపండితుల రచన లన్నింటితో, ఫకీర్‌మోహన్‌కి బాగా పరిచయమున్నదని మనం భావించవచ్చు. అంతగా చదువుకోని ఈ మేధావి ఆ పండితుల ప్రభావానికి లోనుగాక పోవటమే, అతని వచన రచనలను ప్రత్యేకించి రాణింప చేసింది. పాతకాలపు పద్ధతు లకు సంపూర్ణంగా స్వస్తి చెప్పి అతడు తనదైన రాచబాట వేసుకున్నాడు. వస్తువులో, శైలిలో, ధ్యేయంలో, తన మౌలికతను నిలుపుకున్నాడు. రెండు సంవత్సరాల ప్రాథమిక విద్య మాత్రమే నేర్చుకొన్న ఫకీర్‌మోహన్, కల కత్తా విశ్వవిద్యాలయంలో ప్రాచ్య పాశ్చాత్య విద్యలన్నీ శాస్త్రీయంగా నేర్చు కొన్న బెంగాలీ మేధావులకు పోటీగా నిలబడవలసి వచ్చింది. అయినా, అతడు తన రచన లన్నింటిలోనూ, సమంజసమైన ఆధునిక భావాలను స్వీకరిస్తూ, సమాజానికి పుండులాంటి వంశపారంపర్యంగా పరులపై ఆధార పడి బ్రతికే పూజారి వర్గాన్ని దుయ్యబడుతూ, ఇతర సాంఘిక దురాచారా లను ఖండిస్తూ, స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమర్థిస్తూ, భారత జాతి వెన్నెముక అయిన కృషీవలుని స్థితిగతులు బాగుపడాలని వాదిస్తూ, పవిత్ర మానవతా

వాదిగా ప్రకాశించాడు. అర్థశతాబ్దికి పైగా భారత రాజకీయరంగంలోనూ, ఆధునిక భారతీయ సాహిత్యంలోనూ "ప్రజలకోసం" అంటూ వినవస్తున్న ఆత్మవంచనతో కూడిన నినాదాలకు భిన్నంగా ఈ ఒరిస్సా మేధావి ప్రజల గురించి ప్రజల భాషలో నిజంగా ప్రజలకోసమే తన రచనలు చేసాడు. ఆత్మవంచనాపరులైన ఈ "ప్రజాకవు"ల రచనల్లో ఒక్కవాక్యమైనా, ప్రజల హృదయాలలో ప్రవేశించటం మాట అలావుంచి, పండితులనైనా మెప్పించలేకపోయింది. ఫకీర్ మోహన్ గద్యపద్యరచనలన్నీ ఏ కాలంలో నయినా, ఒరిస్సాలోని ఏ ప్రాంతంలోనయినా, గ్రామీణుల హృదయాలలో నిలిచి వుంటాయి.

## గ్రామ్యభాష

సారస్వతంలో శిష్టభాషనేకాక, విద్యావిహీనుల గ్రామ్యభాషను కూడా ప్రయోగించటాన్ని గూర్చి తెలుగు, బెంగాలీ, మొదలైన భారతీయ భాషలలో ఉన్నన్ని వాదోపవాదాలు ఒరియాలో లేవు. ఫకీర్ మోహన్ అందుకు ప్రధాన కారకుడు. వాస్తవానికి రాధానాథ్ రే, మధుసూదనరావులు, సమకాలిక బెంగాలీ శైలిని తలపింపచేస్తూ శిష్టభాషను పాఠకుల కనువుగా సంస్కరించారు. కానీ, సారస్వతరంగంలో ఫకీర్ మోహన్ ప్రదర్శించిన ఆశించని అసాధారణ సాహసం సాహితీ సంస్కర్తల మనుకొనేవారికి దారుణ ఘాత మయింది. ఫకీర్ మోహన్ కథలలోని గ్రామీణ జీవిత వాస్తవిక చిత్రణ ఒక్కసారిగా పాఠకులను ఆకట్టుకొంది. "అలాలెర్ ఘారెర్ దులాల్" (చెడిపోయిన గొప్పింటి బిడ్డ), "హుట్యాటర్ పెంచర్ నక్ష" (గమనిస్తున్న గుడ్లగూబ చెప్పిన కథలు) మొదలైన రచనలలో, యాభైలలోనూ, అరవైల లోనూ, బెంగాలీలలో, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మొదలైనవారి ఉన్నత స్థాయినుండి కొంత దిగివచ్చి కలకత్తా మాండలికంలో రచన చేసే ప్రయత్నాలు జరిగాయి. కానీ, 1897 లో ఫకీర్ మోహన్ కథలూ నవలలూ ప్రారంభించేనాటికి, ఆ ప్రయోగాలు కూడా బెంగాలులో పూర్తిగా మరుగున పడిపోయాయి. ఫకీర్ మోహన్ ఒరియాలో సాధించిన దానికి సమానమైనది బెంగాలీలో సార్థకనామమున్న రామకృష్ణ పరమహంస "కథామృతం" మాత్రమే! ఫకీర్ మోహన్‌లాగే పరమహంస కూడా ప్రజల మధ్యనుండి ప్రభవించాడు. బాహ్యప్రపంచంతో అన్నివిధాల అనుబంధాలూ వున్నా, వారి ఆత్మలు నిరహంకారముగానే నిలిచిపోయాయి.

సామాన్యజనుల భాషపైన సాహితీశైలి అధిపత్యం సంపాదించినా, అర్థ శతాబ్దికిముందే, 'కాలెడ్జ్, వర్డ్స్‌వర్తు'లు తమ "లిరికల్ బాలెడ్స్" (Lyrical Balleds) ఉపోద్ఘాతంలో చెప్పుకొన్నట్లు సాహితీ సౌందర్యాని కంతకూ అదే ఆధారమని ప్రకటించలేదు ఫకీర్‌మోహన్. వాస్తవానికి సేనాపతి వివిధశైలీ రీతులపై తన అధికారం ప్రదర్శించాడు. అవసరాన్నిబట్టి అతడు అలంకారిక భాషనూ వాడాడు. కోట్లాది సామాన్యుల జాతీయ నుడికారాన్నీ ఉపయోగించుకున్నాడు.

## జాతీయ గద్యకావ్యం

ఫకీర్‌మోహన్ కథలు, నవలలూ ఒక నిర్ణీతప్రణాళిక లేకుండా అసంఖ్యాకంగా వెలువడినా, వాటిలో అద్భుతమైన సమగత, శ్రద్ధగా అనుసరింపబడిన మహత్తర ప్రణాళిక, అనేక ఛాయలతో విస్తృతమైన నేపథ్యమూ, చివరకు సర్వజనుల సమగ్రస్వరూపమూ మనకు కనిపిస్తాయి అతని ప్రసిద్ధ నవలలు నాలుగు, అనేక చిన్న, పెద్ద, కథలు; సెర్వాన్టిస్ వ్రాసిన "డాన్ క్విక్సోట్" (Donquixote) లో స్పానిష్‌వారి జాతీయ జీవితాన్ని ప్రతిబింబించినట్లు, రెండు శతాబ్దుల ఒరియా జాతీయ జీవితానికి అద్దం పట్టాయి - లెనిన్ గాంధీలు సామాన్యుని సాంఘిక రాజకీయరంగాలలోకి ప్రవేశింపచేయక పూర్వమే ఇతడు సామాన్యుని సాహితీరంగంలో శోభింపచేసాడు. అయినా అతడు తన విస్తృత పరిధిలో సాంఘిక వర్గ భేదాలను విస్మరించలేదు. సామాన్యునిమీది అతని ప్రేమ అవాస్తవికమైన సాంఘిక - ఆర్థిక, మూఢ విశ్వాసాలనుండికాని, నినాదాలనుండికాని, జనించింది కాదు. అతనికి సామాన్య మానవుడు వర్గమతాతీతమైన అతని సంపూర్ణ మానవత్వంలో - విలీనమయిన ఒక భాగం. అందుచేత ఫకీర్‌మోహన్ పాఠకులు రాజులనుండి పాకీవారివరకూ, ఆదర్శ నాయికానాయకులనుండి వంచకులూ, దుర్మార్గులూ వరకూ, అన్నిరకాలవారినీ కలుసుకుంటారు. అతని నిష్పాక్షిక దృక్పథం అటు గ్రామీణులలోనూ, ఇటు నాగరకులలోనూ, దుష్టులనూ, వంచకులనూ, మూర్ఖులనూ, ఎత్తిచూపుతుంది. మన గ్రామాలనుగూర్చి ఆయన కాల్పనిక ఊహాగానాలేమీ చెయ్యలేదు దురదృష్టవశాత్తూ అలాంటి ఊహాగానాలింకా మనలో ఉన్నాయి. ఆధునాతన భారతంలో టాగూర్

తర్వాత క్రాంతదృష్టిగల సాహితీవేత్తగా ఫకీర్ మోహన్‌ని చెప్పుకోవచ్చు - విశాలమైన అతని మానవతావాదానికి భంగం కలిగించే ఏ సంకుచితత్వానికీ, ఏ విధమయిన కపటానికీ అతడు లోనుకాడు.

# 11

# జీవితాన్ని యథాతథంగా చూపించే దర్పణం

ప్రధానంగా వాస్తవిక దృక్పథంకల ఫకీర్ మోహన్ తన చుట్టూ ఉన్న జీవితంలో పాఠకులకు వివరించవలసిన విషయాలుగా ఏవైనా తనకు ఆసక్తి కలిగించినప్పుడే, కాగితంమీద కలంపెట్టేవాడు. అందుచేత అతని కల్పనా సాహిత్యంలో చాలాభాగం కంటికి కనిపించని వాస్తవిక సంఘటనల నాధారంగా చేసుకున్నదే!

## తిరిగి ఎలుకవైపో!

ఉదాహరణకు అతని సుప్రసిద్ధ కథానిక "తిరిగి ఎలుకవైపో!" (Be a rat again) తీసుకుందాం. ఒక జిల్లాలోని పట్టణంలో ఒక ఉన్నత శ్రేణి గుమాస్తా ఉద్యోగి గ్రామంలోని మంగలి కులానికి చెందిన వ్యక్తిని తన ప్రత్యేక సేవకుడిగా నియమించుకున్నాడు. అతడు ఆజానుబాహువే కాక తెలివైనవాడు. అన్ని పనులకూ ఉపకరించేవాడు. "ఈస్టిండియా కంపెనీ" కొత్తగా వచ్చిన రోజులలో ఉప్పుశాఖలో గ్రామీణులయిన కాపలాదారులు కావలసి వచ్చింది. మన గుమస్తాగారి అభిమానపాత్రుడైన మంగలి తనకొక ఉద్యోగం ఇప్పించమని యజమానిని ప్రార్థించాడు. యజమానికి ఉన్న అధికారంవల్ల ఆపేద మంగలికి ఒక ఉద్యోగం వచ్చింది. మారుమూల గ్రామానికి ఉద్యోగిగా వెళ్ళాక ఆ సేవకుడు "ఆఫీసు యూనిఫాం" వేసుకున్నాడు. అక్కడితో అమాయకులైన పల్లెప్రజలకు ఆతడు సర్వశక్తి సంపన్నమైన 'సర్కారు'లో ఒక భాగంగా కనిపించి అతనిస్థాయి పెరిగింది.

నిన్నటి మంగలి కుర్రవాడు ఈనాడు పడలగొట్టే జమాదార్‌గారు. అతని కాగ్రామంలో అదే ఆఫీసయిన ఇల్లు ఉండేది. అతడు వంటకూ, పై పను లకూ, ఒక నౌకరును కుదుర్చుకున్నాడు. ఆ నౌకరు గొల్లవాడు అంచేత అతడు తన కులం పోతుందని మొదట మంగలి - జమాదార్ కంచాలు కడగటం మానేసి, ఆ తర్వాత తన కులంవాళ్ళు ఒత్తిడివల్ల పనిచెయ్యటం పూర్తిగా మానుకున్నాడు. పైకి వచ్చిన మంగలి జమాదార్ ఈ సాంఘిక అమర్యాదను క్షమించలేకపోయాడు. ఎంతోకాలం కాకముందే గొల్లవాడు రహస్యంగా ఉప్పు తయారుచేస్తున్నాడని అరెస్టు చేయించి, విచారణకై ప్రధాన కార్యాలయానికి పంపించాడు. ఈ రకంగా ఒక్కదెబ్బతో రెండు పిట్టలను కొట్టాలనుకున్నాడు. ఒకటి ఎదురు తిరిగిన యువకుడిమీద పగ తీర్చుకోవటం, తద్వారా గ్రామాని కంతకూ పాఠాన్ని నేర్పటం రెండు: ఉప్పు దొంగను ప్రభుత్వానికి పట్టి ఇచ్చినందుకు బహుమతి నందుకోవటం.

ఈలోగా అహంకారం తలకెక్కిన మంగలి గ్రామ పూజారినే అవమా నించటానికి సాహసించాడు. అవమానింపబడిన వృద్ధ బ్రాహ్మణుడు రోష పూరితుడయినా నిశ్శబ్దంగా "తిరిగి ఎలుకవు అయిపో!" అని ఆ తక్కువ జాతివాడిని శపించటం కంటె ఏమీ చెయ్యలేకపోయాడు.

విచారణ జరుపుతోన్న మేజిస్ట్రేట్ కేసు కొట్టివేసి ఆ పేద గొల్లవానిని విడుదల చేసాడు. కానీ, ముందు ముందు ఇలాంటి కేసులలో చిక్కుకోవలసి వస్తుందని భయపడిన గ్రామీణులు సర్వశక్తి సంపన్నుడైన "జమాదార్ సాహెబ్"కి న్యాయ విచారణల చికాకుల నుండి తప్పించుకోవటానికి రాజీ మార్గంగా, క్రమం తప్పకుండా కొంత డబ్బు చెల్లించడానికి ఒప్పుకున్నారు.

ఇది చాలా బాగా సాగింది. కానీ, జనుల భయాలను ఆధారం చేసు కుని ఉప్పు విభాగంలోని కాపలాదారులందరూ, ప్రభుత్వాదాయం తీవ్రంగా దెబ్బతినేటంతగా అవినీతి మార్గాలలో ధనం సంపాదిస్తున్నారని ప్రభుత్వానికి తెలియవచ్చింది అందుచేత అధికారులు అవినీతికి పాల్పడిన వారిని పట్టు కోవటానికి ప్రత్యేక పరిశీలకులను నియమించారు. మొట్టమొదట పట్టుబడిన కొద్దిమందిలో మన మంగలి జమాదార్ ఒకడు—ఫలితంగా అతనికి ఉద్యోగం పోవటమే కాక జైలు శిక్ష కూడా పడింది.

ఆ రోజులలో జైలుశిక్ష దారుణమైన సాంఘిక పాపకార్యంగా భావింప బడేది. అత్యధిక వ్యయ ప్రయాసలతో కూడిన ప్రాయశ్చిత్తకాండతోకాని

దానికి పరిహారం ఉండేదికాదు. కోర్టులకూ, ప్రాయశ్చిత్తాలకూ అయిన ఖర్చులతో, జైలునుండి బయటపడ్డ "మంగలి జమాదార్" నిరుపేదగా మారిపోయి "తిరిగి ఎలుకవుగా మారిపో!" అనే బ్రాహ్మణుని శాపాన్ని నిజం చేస్తూ తాత ముత్తాతలనాటి మంగలి వృత్తినే తిరిగి ప్రారంభించాడు.

ఫకీర్ మోహన్ ఈ కథను కల్పించలేదు. బ్రాహ్మణుల శాపానుగ్రహ సామర్థ్యాన్ని ప్రతిపాదించే వ్యక్తి కూడా కాదతడు. బ్రాహ్మణ మంగలులిద్దరూ హిందూ సామాజిక వ్యవస్థలోని రెండు పరస్పర విభిన్న వర్గాలకు ప్రతినిధులు. నడమంత్రపుసిరితో తలతిరిగిన వ్యక్తులు ఎంతెంతగా ఎగిరెగిరి పశతారో చూపటానికి కథలో వీరి పరస్పర సంఘర్షణ ప్రవేశపెట్టబడింది. ఫకీర్ మోహన్ ఇతర కథలలాగే, ఈ కథకూడా అతిత్వరగా మారే, తన పరిసరాలను ఆధారంగా చేసుకొని వ్రాయబడ్డదే! జాన్ బీమ్స్ తన ఆత్మకథలో వివరించిన గత శతాబ్దపు డెబ్భైలలో బలాసోర్ జిల్లాలోని ఉప్పు పరిశ్రమకు సంబంధించిన అతని అనుభవాలు ఈ విషయాన్ని రుజువు చేస్తాయి. ఉదారుడైన ఈ బ్రిటిష్ అధికారి గాంధీకంటె ఒక సంవత్సరం ముందుగానే, భారతీయులకు తమ ఉప్పు తాము తయారుచేసుకునే అధికారం ఉన్నదని సానుభూతితో ప్రకటించాడు.

## లచ్ఛమ (Lachhama)

ఫకీర్ మోహన్ నవలలలో కొన్నింటి ఇతివృత్తాలలో ఈ రకమైన వాస్తవికతను పరిశీలిద్దాము. ఆలీవర్దీఖాన్ బెంగాల్, ఒరిస్సా, బీహారులకు నవాబు అయ్యేనాటికి, ఢిల్లీ ఆగ్రాలలోని మొగలులు నామమాత్రావశిష్టులయ్యారు. మరాఠా రౌతులు అప్పటికే రాజ్యపు పొలిమేరలు ఆక్రమించుకొంటూ వచ్చారు. భోన్లాల ప్రధాన కార్యాలయమైన నాగపూర్‌నుండి వచ్చే ఈ బర్గీలకు (bargees) ఒరిస్సా ఎంతో అనుకూలమైన పచ్చిక బయలు ప్రదేశంగా కనిపించింది ఆలీవర్ది రాజధాని అయిన ముర్షీదాబాద్ ఎంతో దూరాన ఉంది. ఆ కారణంచేత ఒరిస్సాలోని అసంఖ్యాకులైన ఖందాయట్ అధికారులు ఈ మరాఠాగుండాల క్రూరమైన దాడులకు తట్టుకోవలసి వచ్చింది. కానీ, వాళ్ళు దెబ్బకొట్టి పారిపోయేవారు – అనుకోకుండా ఆకస్మికంగా వచ్చిపడేవారు – ఆ కారణంచేత తగిన ప్రతీకారచర్య తీసుకోవటం సాధ్యపడలేదు. "బార్గీ" లు మాత్రం వారిలాంటి సుశిక్షితులైన సైనికులు

కారు – వాళ్ళు ఆటవికులు, దోపిడీ దొంగలు – ముఖాముఖి తలపడకుండా, గ్రామప్రాంతాలలోని సామాన్యజనాన్ని దోచుకునేవారు. గ్రామస్థులు ప్రతి ఘటించటానికి ప్రయత్నిస్తే గ్రామాలనన్నీ తగలబెట్టేవారు.

పూర్వం స్వతంత్ర హిందూరాజుల అధికారంలో ఉన్నట్లుగానే మొగలుల ఒరిస్సా "సుభా" గంగనుండి గోదావరి వరకూ వ్యాపించింది – మరాఠా దాడులు క్రమంగా ఈ "సుభా" పశ్చిమ ప్రాంతంనుంచి దాని ఈశాన్యప్రాంతంవరకూ వ్యాపించాయి – సంవత్సరాల తరబడి ఈ ప్రాంత మంతా కోట్లాది బార్గీరౌతుల పైశాచిక విలయతాండవంలో హాహాకారాలు చేసింది. 1744 లో ఆలీవర్ది సేనానులలో ఒకడు సుప్రసిద్ధ బార్గీనాయకుడైన భాస్కరపండిత్‌ని మాయోపాయంతో వధించాడు. ఈ సంఘటన ప్రజలకూ, ప్రభుత్వానికీ, మరిన్ని కష్టాలను తెచ్చిపెట్టింది.

18 వ శతాబ్దపు ఉత్తరార్థంలోని తనవారి ఈ విషాదమయ జీవితం ఫకీర్ మోహన్ "లచ్చమ"లో ప్రతిఫలిస్తుంది.

## "ఛామానా, ఆఠాగుంఠ"

## (Six acres and thirty two decimals)

1803 లో మరాఠాలను ఓడించిన తర్వాత బ్రిటిష్‌వారు ఒరిస్సాను ఆక్రమించుకున్నారు. బ్రిటిష్ వారితోపాటు అనేకులు బెంగాలీ అధికారులూ వచ్చారు. 1804 లోనూ, 1817–18ల లోనూ, ఒరిస్సాలోని బ్రిటిష్ రాజ్యాంగంపై తిరుగుబాటు చేసిన "పైక్" విప్లవకారులు భూస్వాములైన ఖాందాయత్ సేనలను వొదిలేసారు. స్వాతంత్ర్య పోరాటం ప్రారంభం కాగానే బ్రిటిష్‌వారు తీసుకున్న నిర్దాక్షిణ్యమైన చర్యల ఫలితంగా, శతాబ్దాల తరబడి వారి స్వాధీనంలో ఉన్న ఆయుధాలూ, భూములూ, సర్వమూ పోగొట్టుకోవలసి వచ్చింది. ఒక్కరాత్రిలో వేలాది భూ ఖామందులూ, వ్యవసాయ వీరులూ, బిచ్చగాళ్ళూ, కూలీలు అయిపోయారు. ఒరిస్సాలో వాడుకలో ఉన్న "కౌరి" (Couri) నాణేల మారకాన్ని నిషేధించారు. తక్కువ సంఖ్యలో ముద్రించిన కొత్త నాణేలలో పన్నులు కట్టలేక వేలాది సామాన్యరైతులు తమ పిత్రార్జితపు భూములను పోగొట్టుకున్నారు. అన్నింటి కంటె సామాన్యప్రజలకు దౌర్భాగ్యాన్ని తెచ్చిపెట్టినది మెలికలతో కూడిన

భూమిశిస్తుపద్ధతి : సుప్రసిద్ధమైన "సన్ సెట్ లా". (Sun Set Law) – వీటి కారణంగా కలకత్తాలోని గుమాస్తాలు సహితం ఒరిస్సాలోని చరిత్రాత్మక సంస్థానాలను స్వాధీనం చేసుకోగలిగారు. దీని కారణంగా భూస్వాములే లేని ఒక విపరీత సాంఘిక పరిస్థితి ఏర్పడింది. కొత్తగా ప్రవేశపెట్టబడిన భూమిశిస్తు చట్టాలద్వారా భూములు త్వరగా ఒకరిపేరునుండి మరొకరి పేరు మీదకు మారిపోసాగాయి. గడుసువారైన పొరుగువారు, అపుడపుడే బ్రిటిష్ న్యాయస్థానాలలో పైకివస్తోన్న న్యాయవాదుల సహకారంతో అజ్ఞానులూ, అమాయకులూ, అయిన గ్రామాలలో పనివారినీ, రైతులనూ దోచుకున్నారు. ఒరిస్సావారు యాభై సంవత్సరాలకుపైగా "మరాఠా బార్గీ"ల చేతులలో ఆస్తిపాస్తులు పోగొట్టుకొని అష్టకష్టాలూ పడ్డారు. ఆ తరువాత వచ్చిన బ్రిటిష్‌పాలనలోని మొదటి యాభైసంవత్సరాల విషాద చరిత్రకు సంబంధించి నదే ఫకీర్ మోహన్ "ఛామానా, ఆఠగుంఠా".

## "మాము" (Mamu - Maternal uncle - మేనమామ)

గత శతాబ్దపు అరవైలలో ఒరిస్సాలో జిల్లా ప్రధాన కార్యాలయాల లోని కొన్ని ఆంగ్ల ఉన్నత పాఠశాలలలో ఆధునిక విద్యావిధానం ప్రారంభ మయింది. అంతకుమించి చెప్పుకోదగిన విద్యాభివృద్ధి అక్కడ జరగలేదు - ఈ సమయానికి బ్రిటిష్ అధికారులు ఒరియనులకు వారి స్వదేశంలోనే పట్టిన దుర్గతిని అర్థంచేసుకోవటంవల్ల, ఉన్నత పాఠశాల పట్టాలుపొందిన కొద్ది మంది ఉత్కళులకు కనీసం ప్రభుత్వంలోని క్రింది శాఖలలో ఉద్యోగాలు వెంటనే దొరికేవి. బ్రతికి చెడిన కుటుంబాలలోని పిల్లలకు అదృష్టవశాన ఇలాంటి ఉద్యోగం దొరికితే దూరాన ఉన్న తమ గ్రామాలను ఒదిలేసి పట్ట ణాలలో నివాసం ఏర్పరచుకొని తమ భార్యలనుకూడా తీసుకుపోయేవారు. ఒకసారి రెవిన్యూ కార్యాలయపు అద్భుతావరణలోకి ప్రవేశం లభించాక, తమ వంశాల గత వైభవాన్ని పునరుద్ధరించటానికి ధీరత్వంతో పాటుపడే వారు. గత శతాబ్ది ఉత్తరార్థంలో ఒరిస్సాలోని కొత్త పట్టణాలలో ఉండే ఈ సామాజిక పరిస్థితి ఫకీర్ మోహన్ "మాము" (మేనమావ) లో కని పిస్తుంది "ఛామానా, ఆఠగుంఠ" లో కూడా ఇదేవిధంగా, నీచులయిన గ్రామీణ స్త్రీ పురుషులు అవినీతి మార్గాలలో ఐశ్వర్యాధికారాలను సంపాదించే పైశాచిక ప్రపంచాన్ని ప్రదర్శిస్తాడు.

"ప్రాయశ్చిత్త"

1978 లో ఫకీర్‌మోహన్ మరణించేనాటికి ఒరిస్సా అనేక విధాలుగా అధునాతనమయింది. జంటకవులయిన రాధానాథ్ రే, మధుసూదనరావుల "కవితా బాలి" ప్రచురణతో 1872 నుండే ఒరియా సాహిత్యంలో ఆధునిక యుగం ప్రారంభమయింది. అప్పటికి ఒరియనులు ఒకనాటి తమ జాతి ఔన్నత్యాన్ని సంపూర్ణంగా గ్రహించారు. గత వైభవాన్ని పునరుద్ధరించటానికి ఏంచేయాలో తెలుసుకున్నారు - బ్రిటిష్‌వారు ఒరియాను ఆక్రమించు కొన్న వంద సంవత్సరాల తరువాత, ఒరియా విద్యావంతులు ఉత్కల సామిలాని (Utkala Samılanı) ఆధిపత్యంలో ఒరియా మాటాడే ప్రాంతాల సమైక్యతకు ఆందోళన ప్రారంభించారు. యమ్. యస్. దాస్, పండిత గోప బంధుదాస్ వంటి ఒరియా ప్రముఖులు, రాష్ట్ర, కేంద్ర శాసన సభలలో ఒరిస్సా న్యాయబద్ధమైన రాజ్యాంగాధికారపు హక్కులను ఎలుగెత్తి చాట సాగారు. కటక్‌లో ఒరియా వాఙ్మయానికి ఒక అకాడమి (ఉత్కళ సాహిత్య సామాజ) స్థాపించబడింది — తీవ్రధోరణికల ఒరియా వారపత్రికలూ, మాస పత్రికలూ ఒరియా ప్రజలను వారి పూర్వపు ఔన్నత్యం అందుకొనేలా ప్రేరేపించసాగాయి.

కటక్, కలకత్తాలలో ఒరియా యువతరం అభ్యసిస్తోన్న పాశ్చాత్య విద్య ఫలితంగా సాంఘిక విభేదాలు అప్పటికే ప్రారంభమయ్యాయి. అప్పుడప్పుడే విశ్వవిద్యాలయం వదిలి వచ్చిన యువతరంలో కులాల పట్టింపులు సడిలిపోసాగాయి. వారు తమ వధువులను తామే ఎన్నుకోవాలని కోరుకో సాగారు. త్రాగుబోతుతనము, నాస్తికులమని చెప్పుకోవటమూకూడా వ్యాపించ సాగాయి.

1915 లో ప్రచురింపబడిన ఫకీర్‌మోహన్ చివరి నవల "ప్రాయశ్చిత్త" లో ఈ సామాజిక పురోభివృద్ధి సూచింపబడింది. మహాత్ముని రాజకీయ విప్లవ ప్రభావంవల్ల సమాజంలో మరొక పరిణామం ఏర్పడేవరకూ ఒరిస్సా సమాజం మనకీనవలలో కనిపిస్తుంది. 75 సంవత్సరాల పండు ముసలి వయసులో ఫకీర్‌మోహన్ భారత జాతీయ కాంగ్రెస్ వార్షిక సమావేశాలలో పాల్గొనటానికి మద్రాస్‌వెళ్ళి అక్కడ లోకమాన్య తిలక్‌తో మాట్లాడాడు. అయినా 1918 నాటికే మహాత్ముడయిన గాంధీ ప్రస్తావన విస్తృత

మైన ఇతని రచనలలో ఎక్కడా లేకపోవటం గమనించదగిన విషయం. అతని తరంనాటి అనేకులైన భారతీయులలాగానే అతనికికూడా "పాక్స్ బ్రిటానికా" (Pax Britanica) లో గాఢ విశ్వాసం ఉండి ఉండవచ్చును. అయినా అంతర్దృష్టిగల ఈ మేధావి; గడుసరి తెల్లవారు సప్తసముద్రాలు దాటివచ్చి మన సంపదను అనుభవిస్తూ ఉండగా, కట్టెలు కొట్టుకుంటూ, నీళ్ళుమోసుకుంటూ బ్రతికే భారతీయుల మూర్ఖత్వాన్ని తన రచనలలో వ్యంగ్యంగా విమర్శిస్తోనే ఉన్నాడు.

"ఛామానా, ఆరగుంర" (1897) లో ఊరిచెరువును వర్ణిస్తూ నిశిత వ్యంగ్యధోరణిలో అతడిలా అంటాడు: "అనేకమైన తెల్లకొంగలు చెరువు గట్టుకు సమీపంలో ఉన్న నీటిలో మట్టి పెళ్ళలను కాళ్ళతో పెళ్ళగిస్తూ ఒక చిన్న పురుగుతో పొట్టనింపుకోవటం కొరకు రాత్రింబగళ్ళు వృథాప్రయాస పడేవి. కానీ, చూడండి! ఎక్కడినుండో ఎగిరివచ్చిన సముద్ర పక్షులజంట కొన్నిసార్లు మాత్రమే చెరువులో మునిగి పెద్ద చేపలను కడుపునిండాతిని పొట్టబరువుతో ఎగిరిపోతాయి – విందు సమయా లలో తమ సాయంత్రపు గౌనులలో ఉన్న దొరసానులలాగ ఇప్పటికీ ఆ సముద్రపక్షులు చెరువుగట్టున సూర్యకాంతిలో హాయిగా రెక్కలల్లాడిస్తూ కనిపిస్తాయి. నిరాడంబరులైన హిందూ తెల్ల కొంగలాలా! చెరువు సమీపంలో చెట్టుకొమ్మలమీద ఉన్న మీరు, రోజంతా పాటుపడినా కొన్ని చిన్నపురుగులు కూడా దొరకక బాధపడుతోంటే, దూర సముద్రాలనుండి మనదేశానికి ఎగిరి వచ్చిన ఇంగ్లీషు సముద్రపక్షులు వాటి ఖాళీజేబులను అద్భుతమైన చేపలతో నింపుకొని ఆనందంగా ఎలా ఎగిరిపోతున్నాయో చూడండి! ఇప్పుడు జరుగు తున్నది మనుగడకొరకైన తీవ్రపోరాటం. త్వరలోనే ఇక్కడికి మరిన్ని సముద్రపక్షులు ఎగిరిరావచ్చును. అవి ఈ చెరువులో చేపలనన్నింటినీ తినివేయ వచ్చును – బ్రతికి ఉండాలనేకోరిక మీకేమైనాఉంటే, మీరుకూడా ఆ సముద్ర పక్షులలాగే ప్రవర్తించండి – సముద్రాలు ఎలా ఈదటమో మీరు నేర్చు కోవాలి – లేకపోతే ముందు ముందు మీ బొందిలో ప్రాణాలు ఎలా నిలుస్తాయో, నా ఊహకి అందటంలేదు".

పరిశీలకుడూ, దేశభక్తుడూ అయిన రచయిత ఈ రూపకాలలో అర్ధ శతాబ్దం క్రిందటనే ఆనాటి రాజకీయపుటెత్తుగడలను పాఠకులముందు ప్రదర్శిస్తున్నాడు.

సజీవులయిన స్త్రీ పురుషులు

ఈ మహారచయిత నవలలను చర్చించేటప్పుడు మనం రెండు ప్రాథమిక విషయాలను విస్మరించకూడదు – అతనికి ఒకటిన్నర సంవత్సరాల ప్రాథమిక విద్యకు మించిన విద్యాభ్యాసం లేదని; క్రొత్తబాట తీర్చిన నవలా కారుడు కావటంమాట అటుంచి, అసలు రచయితగా రాణించే తలంపే అతనికి లేదని; పద్యాలు, పురాణాలు, వ్యాసాలు, కథలు, నవలలు, అన్నీ యథేచ్ఛగా తనకు తోచినపుడు – ఛందోవ్యాకరణాలు – రసాలంకారాలు - పాఠకులపై తన రచనల ప్రభావము – ఇవేమీ లక్ష్యపెట్టకుండా వ్రాసాడు. సరిగ్గా ఈ కారణాలవల్లనే అతని రచనలు ఆడంబర రహితమైన సహజత్వంతో, పట్టణాలలో, పల్లెలలో ఉండే సామాన్య స్త్రీ పురుషుల వాడుక భాషను, వాస్తవమైన అనుకరణ సాధ్యంకాని, ధారాశుద్ధితో అందిస్తూ, దానిని మేధావంతమైన నిశిత పరిశీలనలతోనూ, స్పందింపచేసే సహజ కళా సంపదతోనూ, సమర్థమైన శిల్పచాతుర్యంతోనూ, అత్యద్భుతంగా అర్థవంతం చేసాడు. ఆ కారణంచేత మనము పాఠశాలకుపోని ఈ ప్రముఖునినుండి "చెనెట్" "హార్డీ"లలోని క్రమపద్ధతిలో సాగిన శిల్ప లక్షణాలను కాని,ఆధునిక కాల్పనిక సాహిత్యంలోని "చైతన్యస్రవంతీ విధానం" వంటి ప్రయోగాలను కాని, ఆశించకూడదు. తన కథనంలో తానెరిగిన స్త్రీ పురుషులను చిత్రిస్తూ ఆ చిత్రణలో మనమెరిగిన స్త్రీ పురుషులను చూపించే సామర్థ్యమే, సామాన్యమైన అతని ఇతివృత్తాలను సజీవంగా నిలుపుతూ వాటికి అమరత్వాన్నిస్తోంది.

పురోభివృద్ధి సృష్టి సహజలక్షణం కావటంవల్ల ఫకీర్ మోహన్ నాటి నుండి నేటికి ఒరియా కాల్పనిక సాహిత్యం నిశ్చయంగా వృద్ధిపొందింది. కానీ, ఈనాటివరకూ ఒరియా నవలాసాహిత్యంలో పల్లెలలోకాని, పట్టణాలలో కాని,విద్యావిహీనులైనసామాన్యజనుల వాడుకభాషను ప్రయోగించటంలోకాని, స్త్రీ పురుషుల వాస్తవిక చిత్రణలోకాని, సేనాపతిని మించినవారుకాని, కనీసం అతనితో సమానులుకాని, నవలాకారులెవ్వరూ లేరు. ఈనాడు మనకు కనిపిస్తున్నది అనుకరణ సాహిత్యం; ప్రచార సాహిత్యం; బహిరంగంగా కావ్య చౌర్యం సాగుతోంది. కానీ, సేనాపతి రచనలలో జీవంపోసుకుని నిలిచినట్లనిపించే మరపురాని పాత్రలవంటి వాస్తవమైన ఒరియా స్త్రీ పురుషులను చిత్రించగల జన్మసిద్ధమైన ప్రతిభమాత్రం ఎక్కడా కనిపించటంలేదు.

మనం ఒకసారి సింహావలోకనం చేసుకుంటే అర్ధశతాబ్దం క్రిందట వ్రాయబడిన అతని రచనలన్నింటిలోనూ, సామాన్యుని కష్టసుఖాలకు సానుభూతిని చూపే మానవత్వమూ; సమాజంలో క్రిందివర్గాలలోని సామాన్యులలో ధీరోదాత్త నాయకులనూ, దుర్మార్గులుగా భావింపబడే ధనికవర్గంలోని ఉదాత్తులనూ; నిరాసక్త, నిష్పాక్షిక దృక్పథంతో చూపగల సున్నితమైన సమదృష్టి – మనను దిగ్భ్రాంతులను చేస్తాయి కులమతాలకూ, సాంఘిక స్థితిగతులకూ అతీతంగా వ్యక్తుల సుఖదుఃఖాలు వారి నైతిక ప్రవర్తనతో ముడిపడి ఉంటాయనీ, సంఘంలోని అన్ని వర్గాలలోనూ, కొందరు ప్రత్యేక వ్యక్తులకు భగవానుడు ఉదాత్తమైన నడవడికను ప్రసాదించి వారిని ఇతరులకు మార్గదర్శకులుగా నిలుపుతాడనీ ఈ మహారచయితకుగల ప్రగాఢ విశ్వాసాన్ని ఇవి ప్రదర్శిస్తున్నాయి.

ప్రశాంత గ్రామీణ – వాతావరణంలో సాగిన హృదయాలను కదిలించే విషాదగాథ – సేనాపతి ''ఛామానా – ఆఠగుంఠ'' అతని కల్పనా సాహిత్యంలోని ఈ విధమైన అసంకల్పిత ఔన్నత్యాలకు చక్కని ఉదాహరణ.

రామచంద్ర మంగరాజు ఒరిస్సా మారుమూల గ్రామంలోని ఒక పేద అనాథ బాలుడు. ఇంటింటా బిచ్చమెత్తుకుంటూ ఎలాగో జీవించేవాడు. కానీ, పుట్టుకతోనే తెలివైనవాడు కావటంవల్ల, సమాజంలో తన స్థానమేమిటో అతనికి చిన్నతనంనుండీ బాగా తెలుసు. తన దురదృష్టానికి ప్రతీకారంగా అతడు తన స్వగ్రామంలోనే అత్యధిక ఆస్తిపరుడుగా స్థిరపడాలని సంకల్పించుకొన్నాడు. ఏవో చిన్న చిన్న వ్యాపారాలు, డబ్బు అప్పులివ్వటం ప్రారంభించాడు. తన భాగ్యాన్ని పెంపొందించుకొనే ఆ స్వల్ప ప్రయత్నాలలో అతనికి విజయం లభించింది.

మంగరాజు నివసించే గ్రామం ఒక ముస్లిం జమిందారు జమీలోది. అతడు బెంగాలులో ఉంటూ, మిడ్నపూర్ తాలూకాలోని తన విలాసమందిరపు దుబారాఖర్చులకై కవులుదార్లను నిరంతరమూ శిస్తులకై పీడించేవాడు. జిత్తులమారి మంగరాజు ఆనాటికి బాగా స్థితిపరుడై పరిస్థితిని శ్రద్ధగా గమనించసాగాడు. కౌలుదారుని శక్తి సంపూర్ణంగా సన్నగిల్లి యజమాని కోర్కెలను చెల్లించే శక్తి ఇకముందు తనకు లేదని ప్రకటించే సమయం వచ్చింది.

సమయంచూసుకుని గడుసరి మంగరాజు రంగంలో ప్రవేశించి జమిందారును కానుకలతో సంతోషపరచి, అతనికి శిస్తులు వసూలుచేసి ఇచ్చే ఉద్యోగం సంపాదించాడు. తెలివిగా తప్పుడు లెక్కలతో శిస్తు బకాయిని చూపించి, జమీనంతనూ కోర్టులో వేలంవేయించి తానే స్వాధీనం చేసుకోవటం మంగరాజుకేమంత కష్టసాధ్యం కాలేదు.

జమిందారైన తరువాత, ఆస్తికోసం ఉన్మాదంతో పరుగులు తీసాడు. న్యాయమార్గాలలోనో, కుత్సితంగానో, ఇతరుల ఐశ్వర్యాన్నీ భూములనూ కబళించసాగాడు నిన్నటి వీధిబిచ్చగాడు ఈనాటి జమిందారు కావటమేకాక, ఇరవైమైళ్ళ చుట్టుపక్కల గ్రామ ప్రాంతాలలో అత్యధిక ఆస్తిపరుడూ, గొప్ప "బేంకరూ" కూడా అయ్యాడు

అతని గ్రామానికి దగ్గిరలో ఒక చిన్న సాలెవాడ ఉంది. వారు వంశపారపర్యంగా నియమింపబడే పంచాయతీపెద్ద ద్వారా తమ సమస్యలు పరిష్కరించుకొంటూ తమ ప్రపంచంలో తాము ఉన్నారు. ప్రస్తుతం వారిపెద్ద విద్యావిహీనుడయిన భాగియా! తన తెగవారి అమాయకత్వానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు ఉంటుంది అతని వ్యక్తిత్వం. అతని భార్య సారియాకూడా అలాంటిదే! సంతానం లేకపోవటంతో వారి వైవాహిక జీవితసౌభాగ్యం అసంపూర్ణంగానే ఉండిపోయింది. అందుచేత సారియా తన మాతృత్వపు మమకారాన్నంతనూ, తాను పెంచే గోవుమీద కురిపిస్తూ వచ్చింది.

ఆ గ్రామంలో ఆరెకరాల ముప్పైరెండు సెంట్ల సారవంతమైన వరి పొలం భాగియాకి ఉండేది. ఈ మధ్యకాలంలో ఎప్పటికప్పుడు పెరుగుతూ వచ్చే మంగరాజు పొలాలు, చిన్నదైనా సారవంతమైన భాగియా పొలం వరకూ వచ్చాయి. అతడక్కడ ఆగవలసిందే నా?

ఈనాటికి మంగరాజు తగినంత ఆర్థికస్తోమతకలవాడు అనుకొంటే, అతడు పురుషునిలో నిగ్రహించుకోవటానికి సాధ్యంకాని మరొక సహజ లక్షణం, కామాన్నికూడా నిర్లక్ష్యం చెయ్యటంలేదు. పేరుకొంటున్న అతని పాపాలమధ్య వెలిగే పవిత్రమూర్తి అతని భార్య. ఆమె పుణ్యమే అతని అదృష్టానికి కారణమని; కల్ల కపటమెరుగని గ్రామప్రజలందరూ ఆమెను గౌరవిస్తారు. కానీ, చంచలుడైన మంగరాజు ఈ పవిత్ర మూర్తిని నిర్లక్ష్యం

చేసి చంప అనే పేరుపడ్డ వేశ్యకు దాసుడయ్యాడు. ఆమె అతని ఇంటి విష యాలలోనేకాక, ఇతర విషయాలలోకూడా పెత్తనం చెలాయించేది.

భాగియా ఆరుఎకరాల ముప్పైరెండు సెంట్లపైన అతని కన్ను పడిం దని తెలుసుకొన్న చంప, అమాయకురాలైన సారియా దగ్గరకు పావురం మీదకు డేగలా వచ్చిపడింది. ఆమె గొడ్రాలితనాన్ని ఆసరాగా చేసుకుని గ్రామంలో చెరువుగట్టున చెట్టుక్రింద గుడిలేకుండా ఉన్న గ్రామదేవతకు గుడికట్టించడానికి ఆమె భర్తను ఒప్పించగలిగితే తప్పక సంతానం కలుగు తుందని ఆశలు రేపసాగింది. సరియా మొదట చాలా సందేహించింది. చివ రకు దుర్భరమైన తన గొడ్రాలితనంనుండి విముక్తిపొందటానికై, చంప మాయమాటలకు లొంగిపోయి, ఆ వంచనను విశ్వసించింది.

భాగియా తన 6 ఎకరాల 32 సెంట్లనూ మంగరాజుదగ్గిర తాకట్టుపెట్టి గుడికట్టటానికై డబ్బు తెచ్చాడు. తాను గుడ్డిగా వేలుముద్రవేసిన తనఖా పత్రంలో ఒక్కమాటకూడా అతనికి అర్థంకాలేదు. తాకట్టుపై భాగియాకు ఇయ్యవలసిన డబ్బుకు మారుగా మంగరాజు కొన్ని ఇళ్ళ రాళ్ళను గ్రామ దేవత సమీపాన పోయించాడు. ఆ రాతిమీద రాతినిపేర్చి గుడికట్టడానికి పాపం, భాగియాకి మరో ఆధారమేదీ లేకపోయింది. తాకట్టు గడువుదాటి పోగానే మంగరాజు అమాయకుడైన భాగియాపై దావావేసి, తేలికగా డిక్రీ పొందగలిగాడు. అతడు భాగియా సారవంతమైన 6 ఎకరాల 32 సెంట్ల పొలాన్నేగాక, వడ్డీక్రింద, దావా ఖర్చులక్రింద, ఆ సాలెదంపతుల ఇంటిని కూడా స్వాధీనం చేసుకున్నాడు. ఇల్లూ, వాకిలీలేని భాగియా వీధులలో బిచ్చమెత్తుకోసాగాడు. ఈ కుత్సిత వ్యవహారం ముగిసిన తరువాత చంప కళ్లు సారియా పెంచుతోన్న గోవు 'సీతా' మీద పడ్డాయి. ఆ గోవు వారికున్న ఒకే ఒక ఆస్తి మాత్రమేకాదు; బిడ్డలులేని సారియాకు ఆరవప్రాణం. ఆ గోవును కఠినాత్ములు బలాత్కారాన్నలాక్కుపోతోంటే చూడలేక, తనకే నీడ లేని నిర్భాగ్యురాలైన ఆ అమాయిక సాలెయువతి - సారియా, ఆ గోవువెనుక మంగరాజు పెరటివరకూ పరుగుపెట్టి తనకు ప్రాణపదమైన దానిని వదల లేక కళ్ళు చెరువులయ్యేలా ఏడ్చింది - ఆమె మొండితనానికి ఆ నిర్భాగ్యు రాలిని మంగరాజు గూండాలు నిర్దాక్షిణ్యంగా చావబాదారు. ఈ బాధలు

పడలేని ఆ బలహీనురాలు మంగరాజు పెరటివరండాలోనే ప్రాణాలు వదిలింది.

ఈ సమయంలో మంగరాజు పవిత్రురాలైన భార్యకూడా మరణించింది. అతని వ్యవహారాలలో ఆశించని మార్పు వచ్చింది - విషాదకరమయిన సారియా మరణం అమాయకుడైన ఆమె భర్తను పిచ్చివాణ్ణి చెయ్యటమేకాక, పోలీసు విచారణకుకూడా దారితీసింది. మంగరాజును "అరెస్ట్" చేసి విచారణ జరిపారు. సారియా మరణానికి అతడే బాధ్యుడని అనటానికి వీలులేక పోయింది. భాగియా ఇంటినీ, పొలాలనూ స్వాధీనం చేసుకోవటం చట్ట సమ్మతమేనని నిరూపించుకోగలిగాడు. అయినా, సారియా గోవును బలవంతాన లాక్కుని పోయినందుకు అతనికి కొన్ని నెలల కఠిన కారాగార శిక్ష విధింపబడింది.

ఆ రోజులలో పిచ్చివారినీ, నేరస్థులనూ, ఒకే కారాగారంలో ఉంచేవారు. భాగియా మంగరాజు లిరువురూ ఒకరికి తెలియకుండా మరొకరు కటక్‌లో ఒకే జైలులో ఉండటం తటస్థించింది. జైలులో మంగరాజు గదిలో ఉన్నవారు ఇదివరలో అతనిచేత అన్యాయంగా జైలుకు పంపబడ్డవారే! అతని అన్యాయాలకు బలిఅయిన ఆ అమాయకులు పట్టరాని పగతో ఒకరాత్రి అతనిని చంపటానికి ప్రయత్నించారు. జైలు డాక్టరు అతని గాయాలకు వైద్యం చేస్తుండగా పిచ్చి భాగియా అతని ముక్కు కోసివేయటానికి తీవ్రంగా ప్రయత్నించాడు. పాపం! మంగరాజు పరిస్థితి మరీ అధ్వాన్నమయింది. నిర్ణీత కాలానికిముందే అతన్ని జైలునుంచి వదిలేసారు. పాడుబడ్డ తన ఇంటి సావడిలో, స్పృహలేని చివరిక్షణాలలో "6 ఎకరాలు – 32 సెంట్లు" - "6 ఎకరాలు - 32 సెంట్లు" – అని అస్పష్టంగా ఉచ్చరిస్తూ, చనిపోయిన పతివ్రత ఆయిన తన భార్య జ్యోతి స్వరూపాన్ని దర్శిస్తూ ప్రాణాలు వదిలాడు.

మంగరాజు జైల్లో ఉండగా చంప అతని ధనాన్నీ, విలువైన నగలనూ సేకరించి రహస్యంగా గ్రామం వదిలిపోయింది. తనకు దక్షతగా మంగరాజు మంగలిపనివాడైన గోవిందుణ్ని తోడుతీసుకుని కటక్ చేరుకుని అక్కడ ఒక వేశ్యగృహం నెలకొల్పాలని ఆమె ఆలోచన. కానీ అతడప్పటికే వివాహితుడు, ఒక బిడ్డ తండ్రికూడ! అతనికి కావలసింది దోచుకున్నదానిలో

భాగం మాత్రమే! ఆరకంగా తాతలనాటి వృత్తికి స్వస్తిచెప్పి ఒక దుకాణం పెట్టుకొని గ్రామస్థులలో గౌరవంగా బ్రతకాలని అతని ఆశ – ఆరాత్రి మార్గ మధ్యాన వారొక పాడుబడ్డ సత్రంలో బసచేసారు, వారివారి ఆలోచనలపై వారికి తీవ్రమైన భేదాభిప్రాయాలు వచ్చాయి. బయట వరండాలో కూచుని భోజనంచేయటానికి గోవిందుడి అభిమానం గాయపడింది. అతడందుకు అంగీకరించలేకపోయాడు. చంపమాత్రం సుష్టుగా భోజనంచేసి డబ్బుసంచీ తలక్రింద పెట్టుకొని గుర్రుపెడుతూ గాఢంగా నిద్రపోయింది. ఆకలితోనూ, అలసటతోనూ, ఎంతోసేపు మథనపడిన గోవిందుడు, ఈ చికాకులనుండి బయటపడే మార్గాన్ని నిర్ణయించుకున్నాడు. అతడు తన మంగలి పొదిలో నుండి పదునైన కత్తి తీసుకున్నాడు. చీకటిగా ఉన్న సత్రంలోకి చొరబడ్డాడు. నిద్రిస్తోన్న చంపను సునాయాసంగా హత్యచేసాడు తరువాత దగ్గిరలో ఉన్న పడవరేవుకు పారిపోయాడు. పడవవాడు మొదట ఒక ప్రయాణీకుడి కోసం తన నిద్ర పాడుచేసుకోవటానికి ఒప్పుకోలేదు. కానీ, కృంగిపోయిన గోవిందుడు అతడెన్నడూ ఆశించనంత పెద్దమొత్తాన్ని ఇస్తాననటంతో చివ రకు ఒప్పుకున్నాడు. పడవ నదిమధ్యకు ప్రవేశించింది – తూర్పు సంధ్య తొలివెలుగులో గోవిందుని బట్టలపైన లెక్కలేనన్ని రక్తపుమరకల నాపడవ వాడు చూసాడు. ప్రశ్నించటం ప్రారంభించాడు. సరిగా ఆ క్షణంలోనే అవతలిగట్టున పోస్టుబంట్రోతు ఉత్తరాల సంచీతో కనిపించాడు. తనను కనిపెట్టి బంధిస్తారేమోనని గోవిందుడు కంగారుపడ్డాడు. అన్యాయార్జితమైన మంగరాజు సంపత్తితో, నదిలోకిదూకి తిరిగి తల ఎత్తకుండా మునిగి పోయాడు.

సామాన్య గ్రామీణ జనులలోనుండి వచ్చిన ఇలాంటి హృదయాలను కదిలించే విషాదగాథలు భారతీయ వాఙ్మయంలో ఎన్ని ఉన్నాయి? ఫకీర్ మోహన్‌కి పూర్వం గ్రామాలలోని అల్లరి చిల్లర వ్యక్తులలోనుండి, పల్లెటూరి బైతులలోనుండి, ఈవిధమైన ధీరులైన నాయికానాయకులను ఎవరు సృష్టించ గలిగారు? ఈ రచనలోనేకాదు! ఫకీర్‌మోహన్ కాల్పనిక సాహిత్య మంతటా ఫకీర్‌మోహన్ మనోహరమయిన పాత్రలన్నీ, మంగలి, సాలె, హరిజన, రైతుకూలీ వర్గాలలోని స్త్రీ పురుషులే!

ఆశ్చర్యాలలోకల్లా ఆశ్చర్యం!—"ఛామానా, అరగుంఠ" (ఆరు ఎకరాలు - ముప్పైరెండుసెంట్లు) అనే పేరుతో నవల వ్రాయాలనే ఆలోచన ఫకీర్‌మోహన్ కెన్నడూలేదు. అతని సంపాదక మిత్రుడైన విశ్వనాథకర్ తన "ఉత్కళ సాహిత్య"కు ఒక కథ కావాలని తిరిగి తిరిగి వత్తిడి చేస్తే ఫకీర్‌మోహన్ ఈ రచన ప్రారంభించాడు. 20 సంవత్సరాల తర్వాత, ఈ సాహిత్యప్రక్రియలో ఇది అతని ద్వితీయ ప్రయత్నం. కానీ, ఈ రెండవ కథ నెమ్మదిగా నవలగా పరిణమించింది.

ఒరిస్సా సాహిత్యంలో "ఛామాన అరగుంఠ" వెంటనే ప్రసిద్ధి పొందటంలో ఆశ్చర్యంలేదు. బహుశః ధారావాహికగా ప్రచురింపబడ్డ డికెన్స్ "పిక్‌విక్ పేపర్స్" అంతగా ఇది ప్రసిద్ధి పొంది ఉండవచ్చును ఆ ఉత్తమ శ్రేణి ఇంగ్లీషు రచనలాగే ఈ రచనకూడా తమ జాతీయ జీవితంలోని అసంబద్ధాలతో ఒరియనులను కడుపుబ్బ నవ్విస్తుంది. అంతకు ముందు వాటి నెవరూ అంత నిశితంగా పరిశీలించి అంత చక్కని హాస్యంగా మలచుకోలేదు. "ఉత్కళ సాహిత్య"లో కథా గమనం "సారియా" మరణంపై పోలీసు విచారణ - చంప హత్య; మొదలైన సన్నివేశాలకు చేరుకొనేసరికి, దూర గ్రామాల నుండి ప్రజలు కోర్టు విచారణనూ, శిక్ష విధించబడ్డ రామచంద్ర మంగరాజునూ చూడటానికి "కటక్" వచ్చేవారు. కథారచనలలో ఎన్ని ఈ రకంగా సుప్రసిద్ధమైన సంచలనాన్ని కలిగించగలవు?

# 12

# అమోఘమైన ఆధునికత

"ఛామాన అరగుంఠ" లోని గ్రామీణ వాతావరణానికి పూర్తి విరుద్ధంగా ఫకీర్‌మోహన్ "ప్రాయశ్చిత్త" "కటక్" నగరం రంగస్థలంగా

సాగుతుంది. 19 వ శతాబ్ది చివరి భాగంలో, విశ్వవిద్యాలయాలనుండి వచ్చిన ఆధునికులు, ఉన్నత వర్గాలవారు, ఈ రచనలో ప్రధాన నటీనటులు. ఎట్టకేలకు ఒరియా వారిలో ఒకటిరెండు తరాలవారు, క్రొత్తగా ప్రారంభించిన విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, పాశ్చాత్య విజ్ఞానాన్ని పొందినట్లుగా ప్రసాదించిన పత్రాలను అందుకోగలిగారు. పాశ్చాత్య ఆలోచనాసరళిలో అక్కడొక ముక్క, ఇక్కడొక ముక్క, నేర్చుకున్న బోలు ఇంగ్లీషు విద్యావంతులతో పోల్చినపుడు తాను పూర్తిగా అజ్ఞానినని సగం వ్యంగ్యధోరణిలో ఫకీర్ మోహన్ తరచుగా అంగీకరించేవాడు. ఈ కాలానికి తలిదండ్రుల అధికారాన్నీ, కులతత్త్వాన్నీ ధిక్కరించటం జరుగుతోంది. సంయమనం లేని ఈ యువకులు త్వరలోనే తమ ప్రగల్భాలకు పశ్చాత్తాపం చెందసాగారు. సంఘంలోని, పెద్దతరంవారు కూడా సమంజసం కాని, అర్థరహితమైన పాతకాలపు మూఢాచారాలవైపు మొగ్గు చూపినందుకు పరితపించసాగారు. ఇదంతా ఫకీర్ మోహన్ నిశితదృష్టిని దాటిపోలేదు. ఈ రెండుతరాలవాళ్లూ, సర్దుబాటూ, సంయమనమూ, లేనందుకు తీవ్రమైన ప్రాయశ్చిత్తాన్ని అదే పేరుతో సేనాపతి రచించిన ప్రసిద్ధ నవలలో చెల్లించుకోవలసి వచ్చింది. ఆ కథ ఈ విధంగా సాగుతుంది :

కటక్ తాలూకాలోని ఒక సంకర్షణ మహంతి (Sankarsana Mahanty) ధనికుడయ్యాడు. ఒక జమీనికొని చిన్నరాజా అనిపించుకొన్నాడు. కాని, ఒకప్పటి సామాన్యమైన తన సాంఘికస్థాయి, ఆర్థికంగా పై అంతస్థు చేరుకోవటానికి తా నవలంబించిన అంతగా గౌరవనీయము కాని విధానమూ, అతడెప్పుడు స్మరించుకొనేవాడు.

అతని జమీకి దగ్గరలోనే వైష్ణవ పట్నాయక్ (Baishnab Patnaik) ఉండేవాడు. అసలైన డాబు దర్పాలకు నిలయమతడు. సమాజం తనను పట్నాయక్‌తో సమానుడిగా గుర్తించాలనేది సంకర్షణుడి జీవితాశయం. పట్నాయక్ కది తెలుసు. నడమంత్రపుసిరితో పైకి వచ్చిన సంకర్షణుడంటే అతనికి అసహ్యం.

పట్నాయక్‌కి ఇంగ్లీష్‌రాదు. అయినా నవనాగరికతకు అనుగుణంగా నడుచుకోవాలని తన ఏకైక కుమారుడు గోవిందచంద్రుణ్ని ఇంగ్లీష్ నేర్చుకోవటానికి కటక్ పంపించాడు. అతడు అందగాడు. అంతగా తెలివైనవాడు

కాకపోయినా, చదువులో శ్రద్ధకలవాడు. అతడు కళాశాలలో ప్రవేశించాక, క్రింది తరగతులలోని విద్యార్థులు అతడిని కవిగా కూడా గుర్తించారు. దానితో అతడు తన వంశానికేకాక, ఒరియా ప్రజలకే ఆశాదీపకుడుగా భావించబడ్డాడు. గోవిందచంద్రుడు ఒరిస్సానుండి ప్రారంభంలో వచ్చిన క్రింది తరగతుల గుంపులో వాడు. వీరంతా సంఘ సంస్కరణవంటి జాతీయ సమస్యలపట్ల ఎంతో ఆసక్తి చూపేవారు. వారికి వారి చర్చావేదికలు (ఆలోచనాసభలు) ఉండేవి. వాటిలో వయసు, రూపము, కవిత్వము, రీవి గల గోవిందచంద్రుడు ధృవనక్షత్రంలా మెరిసిపోయేవాడు.

ఈ సమావేశాలలోనే రాజీవలోచనా, గోవిందచంద్రుల మధ్య స్నేహం పెంపొందింది. కొత్తగా ధనికుడయి సమాజంలో ఉన్నత స్థాయి కోసం తహతహలాడుతున్న సంకర్షణ మహంతి పోషణలోఉన్న మేనల్లుడు రాజీవలోచనుడు. మహంతికి రూపవంతురాలు, వివాహ వయస్కురాలు అయిన కూతురు ఉంది. గోవిందచంద్రుని తలిదండ్రులకు తెలియకుండా ఇందుమతీ గోవిందచంద్రుల వివాహం ఏర్పాటుచెయ్యాలని రాజీవలోచనుడు ప్రయత్నించాడు. ఈ రకంగా తన మేనమావ సాంఘిక స్థాయిని పెంచి గొప్పబహుమతి పొందాలని ఆశించాడు. అపుడపుడే పైకి వస్తున్న కవిలో శృంగారభావాలు కలిగించటానికి, రాజీవలోచనుడు, తన మరదలు ఇందుమతి అద్భుత సౌందర్యవతి మాత్రమేకాక, ఎన్నదగిన కవయిత్రి కూడానని చెప్పాడు.

డార్వీనియను పన్నుగడ

పై పై ఇంగ్లీషు చదువుల ఫలితంగా ప్రతిఫలాపేక్షతో ఏ పనినైనా చెయ్యగల కుత్సితులు నగరంలో బయలుదేరారు. నిశిత దృష్టిగల ఫకీర్ మోహన్ యాభైసంవత్సరాలకు ముందే ఈ విషయాన్ని గ్రహించగలిగాడు. హిందూ సమాజంలోని ఈ క్రొత్త తెగకు "ప్రాయశ్చిత్త"లోని కమలలోచనుడు సరి అయిన ప్రతినిధి. రాజీవలోచనుడు ఈ కమలలోచనుణ్ని పట్టుకుని కొద్దిపాటి మొత్తాన్ని చెల్లించి, సహజమైన ఎన్నికకు సంబంధించిన డార్వీనియను సిద్ధాంతంమీద చక్కని వ్యాసం తయారు చేయించాడు. చిన్న రాజావారు — గోవిందచంద్రుడు, అధ్యక్షత వహించిన "ఆలోచనసభ"లో దీనిని చదివాడు. ప్రపంచాన్నే కదిలించి వేసిన పుస్తకం ఛార్లెస్ డార్విన్

"ఆరిజిన్ ఆఫ్ ది స్పీసీస్" (Origin of the Species). అది ఆధారంగా సాగింప్ శాస్త్రీయ సిద్ధాంత వ్యాసం. ఫలితంగా కులాలతో నిమిత్తం లేకుండా తమ జీవిత భాగస్వాములను ఎన్నుకోవటం యువకుల జన్మహక్కని సభలో తీర్మానించబడింది.

ఇది—ఇందుమతి సౌందర్యాన్నీ, కళాప్రతిభనూ వివరిస్తూ రాజీవలోచనుడు చేసిన ఊరించే వర్ణనలు, గోవిందచంద్రుని మనసులో సంచలనాన్ని కలిగించాయి. సంఘంలో చిన్నచూపు చూడబడే మహంతి వంశంతో వైవాహిక సంబంధానికి అతడు అంగీకరించాడు. ఈ సంబంధం తన నల్లారు ముద్దుగా చూసే ముసలి తలిదండ్రుల హృదయాలు ముక్కలు చేస్తుందని అతనికి బాగా తెలుసు. ఈ రహస్యవివాహ విషయం, పట్నాయకుల ఇంట్లో తెలిసే సరికి, వృద్ధ వైష్ణవ పట్నాయక్ డాబు దర్పాలు చెదిరిపోవటం మాత్రమే కాదు – అతని కుటుంబ జీవితమే సర్వనాశనమయింది.

అప్పటినుండీ గోవిందచంద్రుడు తిరిగి తన తలిదండ్రుల నెన్నడూ కలుసుకోకుండా చూసే భారం రాజీవలోచనుడి మీద పడింది. కానీ, కటక్‌లో ఉండగా, మరణశయ్యమీద ఉన్న తన తల్లి తన ఒక్కగానొక్క బిడ్డను చివరిసారిగా చూడాలనుకొంటున్నదని అతనికి తెలిసింది. అతడు తన గ్రామానికి ప్రయాణమయ్యాడు. రాజీవలోచనుడు వెంటనే గోవిందుని ఏర్పాట్లను భంగం చెయ్యటానికి సమకట్టాడు. ఉరుకులతో, పరుగులతో, తన మేనమామను చేరుకొన్నాడు. గోవిందుడు తన తలిదండ్రులను కలుసుకుంటే ఇందుమతి భవిష్యత్తు ఏమవుతుందోనని భయపెట్టాడు. వీలైనంత త్వరలో తన దగ్గిరకు రమ్మని భర్తను వేడుకొంటూ భావతీవ్రతతో వ్రాసిన పద్యం క్రింద, పాపం, అమాయకురాలైన ఇందుమతితో సంతకం పెట్టించాడు. పడుచుదనంలో ఉన్న ఏ భర్తా నిర్లక్ష్యం చెయ్యలేనంత మనోహరంగా ఉందా కవితా లేఖ. రసికుడైన గోవిందచంద్రుడు తలిదండ్రులను కలుసుకోవటం వాయిదావేసి, తక్షణమే ఇందుమతి దగ్గిరకు బయలుదేరాడు.

గోవిందుడు మామగారి గ్రామం చేరుకునేసరికి రాత్రి బాగా చీకటి పడింది. అది వర్షఋతువు. ఆ చుట్టుపక్కల కొన్ని దొంగతనాలు జరిగాయి. గోవిందుడి కిదంతా తెలియదు. అతడు ఇందుమతిని ఆశ్చర్యంలో ముంచాలని కలలు కంటున్నాడు. ఇందుమతి గదులు సరిగా నదీతీరాన

ఉన్నాయని అతనికి తెలుసు. అందరూ నడిచేవారిని వదిలేసి నదీతీరం వెంట కాలిబాటను వెళ్ళి అర్ధరాత్రి సమయాన ఇందుమతి గది కిటికీ తట్టాడు. ఇటీవలి దొంగతనాలు మనసులో మెదలుతుంటేనల్ల ఈ అర్ధరాత్రి చప్పుళ్ళకు ఇందుమతి దాసీది హడలిపోయి, అరవటం మొదలుపెట్టింది – ఇది స్త్రీ జనంలో సంచలనం కలిగించింది – దాసీజనమంతా ఒక్క పెట్టున అరవటం ప్రారంభించారు. బయట చీకట్లో ఎదురుచూస్తున్న ఆ శృంగార పురుషుణ్ని - అల్లుడుగారిని; దొంగ అనే అనుకున్నారు. మహంతి మనుష్యులు నది ఒడ్డంతా గాలించి గోవిందుణ్ని ఈడ్చుకుపోయారు అతడిని కాళ్ళూ చేతులూ కట్టేసి, చితకతన్ని, చీకటికొట్లో పారేసారు! తెల్లవారాక అతని సంగతి తెలుసుకోవచ్చు ననుకున్నారు.

తెల్లవారింది! జరిగిన లజ్జాకరమయిన దారుణం బయట పడింది గోవిందచంద్రుణ్ని తక్షణమే కటక్‌లోని ప్రభుత్వ వైద్యాలయంలో చేర్పించి వైద్యం చేయించారు! అతడు కోలుకుంటూ ఉండగా తల్లి మరణవార్త చెవిన పడింది. ప్రాణప్రియునికి జరిగిన అవమానం భరించలేక, ఇందుమతి ఇంటివెనుక ఉన్న నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నదని కూడా తెలిసింది. తన దర్జాలకి గర్వించే పట్నాయక్ – ఆ దర్జా పొందాలని తహతహలాడే మహంతి: ఇరువురి భ్రమలూ చెదిరిపోయాయి – ఒకరికి తెలియకుండా మరొకరు సన్యాసం స్వీకరించి గృహాలు వదిలేసారు. గోవిందచంద్రుడు కూడా ఇదే ఉద్దేశంతో కటక్ హాస్పిటల్ నుంచి బయలుదేరాడు.

వారంతా జీవితంలో తమ అపరాధాలకు పశ్చాత్తప్తులవుతూ కాషాయ వస్త్రాలలో మధురలో ఒకరినొకరు కలుసుకున్నారు – పట్నాయక్ మహంతీలు ఒకప్పుడు సాంఘికంగా ప్రత్యర్థులయినా, ఇప్పుడు ప్రాణ స్నేహితులయ్యారు. వారు మధురలోనే ఉండిపోయి, గోవిందుణ్ని తమ జమిలు చూసుకోవటానికి పంపేసారు అతడు తిరిగివచ్చి రెండు జమీలమీద రాబడినీ ప్రజాభ్యుదయ పథకాలకే వినియోగించాడు. చిన్నతనంలోని తన పొరపాట్లకు ప్రాయశ్చిత్తంగా తన శేషజీవితాన్ని అవివాహితుడిగా గడిపాడు - ఆ విధంగా ముగుస్తుంది ప్రాయశ్చిత్త కథ. ఇది ఫకీర్ మోహన్ చివరి నవల. అతని మరణానికి మూడు సంవత్సరాలు ముందుగా ప్రచురింప బడింది.

ఫకీర్ మోహన్ పాఠశాలలలో చదువుకున్న దేమీలేదు - అయినా సమకాలిక రాజకీయకలాపాలనూ, శాస్త్రీయ సిద్ధాంతాలనూ చక్కని అవగాహనతో సృజనాత్మకంగా ఉపయోగించుకోగలిగాడు. ఎంత అద్భుతమైన విషయం! డార్వినియను సిద్ధాంతంమీద కమలలోచనుని వ్యాసం "ప్రాయశ్చిత్త" ఇతివృత్తాన్ని ఫలోన్ముఖం చేయటంలో కీలకపాత్ర వహిస్తుంది. నవలలో కథానాయకుని సాంఘికంగా తక్కువస్థాయి వారితో వైవాహిక సంబంధానికి అంగీకరింప చెయ్యటంద్వారా హిందూ సంఘ సంస్కరణధ్యేయం, ఆ వ్యాసానికి! ఈ కథకు ఇంత చక్కని ముగింపునిచ్చే విశ్వవిద్యాలయ విద్యార్థుల చర్యలకు ఈ వ్యాసాన్ని కారణంగా చూపటం, అత్యంత ఆధునికత! "ప్రాయశ్చిత్త" లో "సహజమైన ఎన్నిక" పైన సిద్ధాంత వ్యాసం చాలా సమర్థవంతంగా ఉంది. తాను సేకరించిన విజ్ఞానాన్ని సృజనాత్మకంగా ఉపయోగించుకొనే రచయిత ప్రతిభకిది తార్కాణం.

## అపరిపక్వత నుండి పరిపక్వతకు

ఈ రచనలోనేకాదు! - నవల లన్నింటిలోనూ, అనేక కథలలోనూ ఫకీర్ మోహన్ పాఠకుల హృదయాలను అపరిపక్వత నుండి పరిపక్వతకు చేరుస్తాడు. అతని పాదాలు సహజత్వంలోనే స్థిరంగా ఉన్నా, తన పాత్రలకు లోతునూ, ఔన్నత్యాన్నీ సమకూరుస్తాడు. "ప్రాయశ్చిత్త"లో డాక్టర్ గోవిందచంద్రుల సంభాషణ ఇందుకు ఉదాహరణ-కటక్ ఆస్పత్రిలో కోలుకొంటున్నప్పుడు, ప్రక్కన ఒక రోగి మరణం చూసిన గోవిందచంద్ర డాక్టర్‌తో జీవితం, మృత్యువు, ఆత్మ మొదలైన లోతైన సమస్యలకు సంబంధించిన ఎన్నో ముఖ్యమైన విషయాలు సంభాషిస్తాడు. ఒరిస్సాలోని పెద్ద కుటుంబాలలో మరణానంతరం 11-వ దినాన "శుద్ధి" జరిపే ఆచారం ఉంది. ఇది ఆధారంగా గడుసువాడైన రచయిత తన "మాము" నవలలో ఒక పండిత గోష్ఠిని ఏర్పాటుచేసాడు. యువనాయకుని గుండెలు పిండే విషాదమరణవర్ణన తరువాత ఉదాత్తమైన ఈ గోష్ఠి ఎంతో హాయినిస్తుంది - ఈ రెండూ ఒకదాని ప్రభావాన్ని మరొకటి అధికంచేస్తూ బంగారునగలో పొదిగిన వజ్రంలాగ ఉన్నాయి. ఆశలతో, కోరికలతో సతమతమయ్యే సాధారణ స్త్రీ పురుష సమూహం మధ్య, భగవత్తత్వంమీద, ఆత్మమీద, సమర్థులైన పండితుల చర్చలు చాలా ఉదాత్తంగా ఉన్నాయి. ఆ విధమైన

ఆధ్యాత్మిక చర్చలలో సహితం హాస్యాన్ని సృష్టించే ప్రతిభ ఫకీర్ మోహన్‌ది. తెలుగు పండితుడైన రంగభట్ట వెంకటపంతులిచేత సంస్కృత శ్లోకంలో ఇలా చెప్పాడు :—

"దర్శనాలూ వేదాలతోపాటు జన్మజన్మలకూ మూడు దివ్యవరాలు – పులుపు, కారము, పుల్ల మజ్జిగ – నాకు లభ్యమగునుగాక !"

సేనాపతి కాల్పనిక సాహిత్యంలో మరో గొప్పగుణం కూడా ఉంది – అతని రచనలన్నింటిలోనూ, మంచివారూ, చెడ్డవారూకూడా బాధల పాలవుతారు. బాధను జీవితంలో ఒక భాగంగా అతడు స్వీకరించాడు. నిజంకూడా అంతే! అయితే అతని నవలలో మంచివారు బాధలద్వారా మరింత ఉన్నతులవుతారు. దుర్మార్గులు బాగుపడతారు. అప్రస్తుతము, అసమంజసము, హానికరము, అయిన విషయాలను సంస్కరించుకోవటమే అతని ఆశయమయినా, అతడెన్నడూ ఏరూపంలోనూ నీతిబోధకు పూనుకోలేదు. పాపమనేది అతని దృష్టిలో సర్దుకోలేకపోవటం మాత్రమే! పాపులనుకోబడే ఆయన పాత్రలన్నీ తరచుగా తమ తప్పు తెలుసుకుని పశ్చాత్తాపంతో పునీతులవుతూ ఉంటారు.

ఈ రకంగా ఫకీర్ మోహన్ రచనలు శ్రుతిబద్ధమైన సంపూర్ణసృష్టి – ఒరిస్సా జీవితానికీ, సమాజానికీ అద్దం పడుతోనే అవి ఆనందాన్నీ, ఆశ్వాసననూ, ఆత్మోన్నత్యాన్నీ కలిగిస్తాయి. వాస్తవికత, ఆదర్శము, ఇంత శ్రుతిబద్ధంగా సమ్మేళన చెందిన కళాఖండాలు అరుదు. నవలాకారుడుగా రాణించే ఆలోచన ఇతనికిలేదనీ, అవసరమయినపుడు మాత్రమే వ్రాసాడనీ మనకు తెలిసినపుడు, అమోఘమైన ఇతని మేధను అంగీకరించి జోహారులర్పించవలసిందే !

"ఛామాన, అరగుంఠ", "మాము", "ప్రాయశ్చిత్త" ఫకీర్ మోహన్ సాంఘిక నవలలు – ఈ మహామనిషికి జన్మసిద్ధమయిన విషయ పరిశీలనా దక్షతకు తార్కాణగా రాణిస్తున్నది, ఈతని ఏకైక చారిత్రక నవల, "లచ్ఛమ".

# 13

# అచ్చపు భారతీయత విరిసిన పుష్పం

"ఉత్కళ సాహిత్య" లో 1901 నుండి 1903 వరకూ "ఛామాన, ఆరగుంఠ" లాగానే "లచ్ఛమ" కూడా ధారావాహికంగా ప్రచురింపబడింది- అదే సంవత్సరంలో బ్రిటిష్‌వారు ఒరియాను ఆక్రమించుకొన్న ఒక శతాబ్ది తరువాత, ప్రపంచంలోని ఒరియా మాట్లాడే ప్రాంతాలన్నింటినుండీ ప్రతినిధులు కటక్‌లో సమావేశమై ఒకేపాలనాధికారంలో ఉండాలనే కోరికను ప్రకటించారు. దేశభక్తితో అట్టుడికిపోయిన రోజులలో వ్రాయబడిన చారిత్రక నవల అయినా ఫకీర్‌మోహన్ "లచ్ఛమ"లో ఎక్కడా విదేశీయులపట్ల దారుణ విద్వేషం కనిపించదు.

వ్రాసినది హిందువే అయినా, ప్రజలను పీడించే హిందూ "బార్గీ"లపై ముస్లిం నవాబు ఆలీవర్ధీఖాను విజయంతో ముగుస్తుంది 'లచ్ఛమ'. ఈ రచనలో ఫకీర్‌మోహన్ సృజనాత్మక నిష్పాక్షికత అత్యంత సుందరంగా కనిపిస్తుంది. హిందూ ముస్లింలు కేవలం పాత్రలుగా వచ్చిపోతారేతప్ప, ఆయా మతవిశ్వాసాలకూ, దృక్పథాలకూ, ప్రతీకలుగా నిలిచిపోరు. నిరాశలోఉన్న ముస్లింలను చిత్రించటంలో ఈ హిందూరచయిత ప్రదర్శించిన ప్రగాఢమైన సానుభూతి ప్రశంసనీయం. మొత్తంమీద భారతదేశాభ్యుదయాన్ని వాంఛిస్తూ హిందూ ముస్లింలలో ఎవరిదోషాలనైనా సరిదిద్దేవాడు.

ఈ విషయాలదృష్ట్యా, ఆధునిక హిందూసాహిత్యంలో వెలువడిన కొద్దిపాటి నిజమైన భారతీయ గ్రంథాలలో, 'లచ్ఛమ'ను ప్రప్రథమమైనదిగా పరిగణించవచ్చునని రచయిత ఉద్దేశం. ఈనాటి భారతీయ మేధావులు తమనూ, తమ రచనలనూ, నిజమైన నిష్పాక్షిక దృష్టితో విశ్లేషించి చూసుకొంటే, భారతదేశంలో రచింపబడిన పుస్తకాలలో కొన్ని మాత్రమే నిజంగా భారతీయమైనవని, గుర్తించటం కష్టంకాదు. కాళిదాస వాల్మీకులవలె భార

తీయత ఉన్న రచయితలు బహుకొద్దిమంది. మనమంతా బెంగాలీలుగా, ఆంధ్రులుగా, మహారాష్ట్రులుగా గొప్పవారమే కావచ్చును. కానీ, భారతీయులుగా రాణించగలిగే దృక్పథమూ, సామర్థ్యమూ ఆశయమూ, కొద్దిమందికి మాత్రమే ఉంటాయి. బంకించంద్రుని విషయం వదిలేసినా రవీంద్రనాథుని ఉత్తమరచనలు సహితం, కేవలం బెంగాలీ, లేక హిందూ, స్థాయిని అధిగమించినవికావు. ఈ కోణాలనుండి చూసినపుడు డెబ్బయి సంవత్సరాలక్రిందట వ్రాయబడిన 'లచ్చమ' ఆధునిక భారతీయ వాఙ్మయంలో పరిగణనీయమైన రచనగా నిర్ణయింపవచ్చు.

ఆ కథ క్లుప్తంగా ఇది :

18–వ శతాబ్ది చివరిభాగంలో కొందరు గ్రామస్థులు జగన్నాథ్‌కి తీర్థయాత్రలకు బయలుదేరారు. సుదీర్ఘమైన వారి యాత్ర ముగిస్తూ వారు బెంగాల్ ఒరిస్సాల ఈశాన్య సరిహద్దు దాటుతున్నారు. ఆ కాలంలో సర్వసాధారణమైన దొంగలదాడులను తట్టుకోవటానికై ఆయుధాలతో గుర్రాల మీద బయలుదేరారు. కానీ, దురదృష్టవశాన ఈ గుంపు సరిగా బెంగాల్ ఒరిస్సా సరిహద్దు దాటుతున్నప్పుడు 'మరాఠా' రౌతులు అకస్మాత్తుగా వీరిపైన దాడిచేసారు. యాత్రికులను అటకాయించి వారి ధనాన్నీ వస్తువులనూ పూర్తిగా దోచుకున్నారు. ఆ రాత్రి అలముకొంటున్న చీకటిలో యాత్రికులు తమలో ఎవరెక్కడ ఉన్నారో, ఎవరికేమయిందో తెలుసుకోలేక పోయారు.

ఈ దోపిడీ జరిగిన ప్రదేశానికి దగ్గరలోనే రైబానియా (Raibania) కోట ఉంది. దాని శిథిలాలు అడవిలో కప్పబడి ఇప్పటికీ, బలాసోర్ జిల్లాలోని జలేశ్వర్ పట్టణానికి రెండుమైళ్ళ దూరంలో కనిపిస్తాయి. ఆ సమయంలో ఆ కోట "సామంతరే రాఘవ రాట్సింగ్ బైరిగంజన మాంధాత" (Samantaray Raghava Ratsing Bairiganjana Mandhata) స్వాధీనంలో ఉంది. అతడొక ప్రముఖ ఖండాయత్ నాయకుడు. ముస్లింలు, మరాఠావారు – అతని సహాయాన్ని అర్థిస్తూఉండేవారు. దోపిడీలకూ, దుర్మార్గాలకూ, ఆలవాలమైన పరిసరాలమధ్య ఆ రాజదంపతులు తమ మానవత్వంతో, సంస్కారంతో మంచి ప్రజాదరణను పొందగలిగారు. సాహసవంతులైన రైబానియా "పైక్స్" (Paiks) యోధులు తనకు చేసిన సహాయానికి ప్రతిఫలంగా ఆలీవర్దీ సువర్ణరేఖా నదీతీరం పొడుగునా, ప్రసిద్ధ

"బార్గీ" నాయకుడైన భాస్కర్ పండితుని నాయకత్వంలోని మరాఠావీరులపై దాడి చేసాడు.

ఒక ఉదయాన రాఘవరాత్సింగ్ సభలోకి అతని మనుష్యులు అడవులో ఏమూలనుండో అందమైన పల్లెపడుచును తీసుకుని వచ్చారు. సభ నిర్ఘాంతపోయింది. ఆమె మూఢురాలివలె ఏ ప్రశ్నకూ సమాధానం చెప్పలేకపోయింది. అందుచేత ఆమెను అంతఃపురంలో తల్లివంటి రాణీగారిదగ్గిరకు పంపారు. నెమ్మదిగా ఆ యువతి లచ్చమ అనీ, ఇటీవల మరాఠా 'బార్గీ'ల పాలబడిన యాత్రికులలో ఎలాగో ప్రాణాలు దక్కించుకొన్న దురదృష్టవంతురాలు అనీ తెలిసింది.

కానీ సౌందర్యాన్నీ, సత్ప్రవర్తననూ, దురదృష్టం వెన్నాడుతూనే ఉంటుందేమో? నిస్సహాయురాలైన 'లచ్చమ'కు రైబానియాకోటలో రక్షణ దొరికి ఎంతోకాలం కాలేదు. అంతలోనే మరాఠా నాయకుడైన పండిత షియో శంకరమాలవీర (Pandit Sheo Shankar Malavira) ఆలీవర్దీకి వ్యతిరేకంగా నాగపూర్ "భోన్స్లా" (Bhonsla) లకు ఈ ప్రముఖ ఖండాయత్ నాయకుని సహకారాన్ని కోరటానికై రైబానియా కోటకు వచ్చాడు

సభలో సాగిన సంభాషణలకు నవలలో ఒక అధ్యాయమంతా వినియోగించ బడింది. ఈ మరాఠా సర్వాధికారి పాఠకులకు, శివాజీ బ్రాహ్మణ మంత్రి – సుప్రసిద్ధ పండితుడు – హన్మంతేని గుర్తుకు తెస్తాడు. రైబానియా ప్రభువు బైరిగంజన్ మాంధాత ఆస్థానం తరఫున బ్రాహ్మణవక్త వనమాలి వాచస్పతి సంభాషించాడు. జగన్నాథానికి పోతున్న నిస్సహాయులైన యాత్రికులపై జరిపిన విషాదకరమూ, ఆటవికమూ, అయిన దాడి – హిందువులు హిందువులపై జరిపిన విధ్వంసకాండకు బలియై ఎలాగో బ్రతికిన లచ్చమ శోకమూర్తి – వాచస్పతి స్మృతిపథంలో మాసిపోక నిలిచినందువల్ల, షియో శంకర్ చేసిన ఇస్లామ్ వ్యతిరిక్తవాదనలను తీవ్రంగా ప్రతిఘటించాడు. దేశంలో సామాన్యజనానికి కావలసింది చక్కని పరిపాలన మాత్రమే అయినపుడు మతాల ప్రస్తావన తేవటం అర్థరహితమని అతడు నిరూపించాడు. మరాఠా దోపిడీదారులు రక్షణలేని గ్రామప్రాంతాల నెన్నింటినో వ్యర్థంగా వదిలివెయ్యటం అతడు ఎత్తిచూపించాడు. తమ మతంవారే దురాగతాలకు పూనుకోవటం క్షమించరానిదన్నాడు. నవద్వీపానికి చివరిసారిగా వెళ్ళినప్పుడు కలకత్తాలో ఒక తెల్లవాడైన క్రైస్తవ మతాచార్యునితో మాట్లాడాననీ,

అతని మానవతా దృక్పథానికీ, భగవద్భక్తికీ నివ్వెరపోయాననీ అత డన్నాడు. సప్తసముద్రాలూ దాటివచ్చిన ఈ కొత్తజాతి, అమానుషంగా పరస్పరం హింసించుకొంటూన్న హిందూముస్లింలపై తన ధార్మికౌన్నత్యం తోనే ఆధిపత్యం వహించగలదు.

మరాఠా రాయబారి రైబానియా ఆస్థానంనుండి రిక్తహస్తాలతో పోవలసివచ్చింది. కానీ అతడు పగతీర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. అందుకు ఎంతో కాలం పట్టలేదు. శక్తిమంతులైన భోన్స్లాల స్నేహాన్ని తిరస్కరించిన దూరదృష్టిలేని మొండివాడయిన ఖండాయత్ నాయకునికి ఒక రాజకీయపాఠం నేర్పటానికై నాగపూరునుండి పెద్ద సిపాయిలదండు వచ్చి పడింది. రైబానియా రక్షకదళాలు సన్నద్ధంగా లేనపుడు – సైనికులందరూ ఆలీవర్దీకి సహాయంగా దూరంగా బెంగాల్ యుద్ధభూమిలో ఉన్నప్పుడు మరాఠా దళాలు రైబానియాపై ఆకస్మికంగా వచ్చి పడ్డాయి.

ఫలితంగా చరిత్రాత్మకమైన కోట పడిపోయింది. ధీరుడైన దాని నాయకుడు, వనమాలి వాచస్పతితోపాటు మరాఠాలకు బందీఅయి, ధైర్యంగా మృత్యువును చేరుకొన్నాడు. లచ్చమ కొంగున కొన్ని బంగారునాణేలు ముడి వేసి ఆమెను మరాఠా దుండగులబారినుండి దూరంగా తప్పించిన తరువాతనే రాణి నీటిలోమునిగి మరణించింది. వనమాలి వాచస్పతి బ్రాహ్మణత్వము అతని ప్రాణాలను కాపాడింది.

ప్రస్తుతం యుద్ధంలో అదృష్టం మరాఠావారివైపు మొగ్గింది. ఆలీవర్దీ సేనలు నెమ్మది నెమ్మదిగా బెంగాల్ నడిబొడ్డున ఉన్న కట్వావరకూ తరుమ బడ్డాయి. కానీ, అప్పటికి మూడేళ్ళ నిర్విరామ యుద్ధంతో ఉభయ పక్షాలూ నిస్త్రాణ చెందాయి. లాంఛనమాత్రంగా సాగాయి, రాయబారాలు. 'బార్గీ' నాయకుడైన భాస్కర పండితుడు, నవాబ్ ఆలీవర్దీ, ఉభయుల యుద్ధస్థావ రాలకూ నడుమ సిల్కు గుడారంలో కలుసుకోవటానికి ఒప్పందం చేసు కున్నారు.

ఈలోగా తమలపాకులమ్ముకొనే అందమైన పడుచువాడొకడు మరాఠా సేనలను ఒక యుద్ధరంగంనుండి మరొక యుద్ధరంగానికి అనుసరిస్తూ ఆ గుడారాలలో అందరికీ ప్రీతిపాత్రుడయ్యాడు. ఆలీవర్దీ సేనాస్థావరాలలో బదల్ సింగ్ అనే నూతన సైనికాధికారి మంచిపేరు తెచ్చుకొన్నాడు. ఒక

క్లిష్ట సమయంలో అతని ధైర్య సాహసాలు, త్యాగశీలత, ఆలీవర్దీ ప్రాణాన్ని కాపాడాయి. ఆ కారణంగా అతడు ముస్లిం అధికారులపై అధికారిగా నవాబు అంతరంగిక అంగరక్షకుడుగా బాధ్యతాయుతమైన పదవిని అందుకో గలిగాడు.

నిర్ణీత సమయాన కాట్వాలోని సిల్క్ గుడారంలోకి భాస్కర పండి తుడు వీరోచితంగా ప్రవేశించాడు. నవాబ్ ఆలీవర్దీ స్వయంగా అతనికి స్వాగతం పలికాడు. సౌహార్ద్రసూచకంగా గాఢాలింగనం చేసుకున్నాడు ఆ నాయకుల కౌగిలి విడివడుతుండగా, ఇరువురు వ్యక్తులు మెరుపుల్లా భాస్కర పండితుడిమీదపడి తక్షణమే అతడిని చంపేసారు. వీరిరువురు ఎవరోకాదు! మరాఠా గుడారాలలో తమలపాకులమ్మిన అందమైన పడుచువాడొకడు - ఆలీవర్ది విశ్వసనీయుడైన అంగరక్షకుడు - యువకహవిల్దార్ బాదల్‌సింగ్ మరి ఒకడు - బదల్ ఆజ్ఞకు నిరీక్షిస్తున్న నవాబ్ సైన్యం అతని సూచన అందుకోగానే ప్రమత్తులైఉన్న మరాఠాలమీదపడి వారిని సర్వనాశనం చేసింది.

మంచివాడైన నవాబు ఈ రాజకీయ హత్యకు మొదట ప్రమాన్పడ్డాడు. అయినా, మనసులో ఎంతో ఆనందించాడు. బాదల్‌సింగ్‌ను, బెంగాల్‌లోని వనవిష్ణుపుర్ పరిగణాకు కొత్త రాజుగా ప్రకటించాడు. తమలపాకులమ్మే పడుచువాడికికూడా గొప్ప బహుమతి ఈయాలనుకొన్నాడు.

కానీ, దర్బారులోఉన్న అధికారులందరూ విస్తుపోయేలాగ అతడు, హత్యలో తన భాగస్వామి బదల్‌సింగ్ తన సోదరిని వివాహమాడటానికి అనుమతించటమే తానుకోరే బహుమతి - అన్నాడు.

అందరినీ మరింత ఆశ్చర్యపరుస్తూ బదల్‌సింగ్ ప్రలోభకరమయిన ఈ ప్రతిపాదనను తీవ్రంగా తిరస్కరించాడు. సౌందర్య సౌశీల్యాలుగల ఒక యువతిని తాను వివాహమాడాననీ, జీవితాంతమూ ఏకపత్నీవ్రతం పాటిస్తానని ఆమెకు వాగ్దానం చేసాననీ, తన భార్య చనిపోయి చాలా కాలమయినా, ఆ ప్రమాణం పాటించడానికే నిశ్చయించుకొన్నాననీ అత డన్నాడు.

నవాబునూ అతని పరివారాన్నీ ఆశ్చర్యంతో ముంచుతూ, తమల పాకులమ్మే వ్యక్తి, బదల్‌సింగూ, ముర్షిదాబాద్‌నుండి రాత్రికి రాత్రే మాయ

మయ్యారు. కొన్ని రోజులు గడిచాయి. గయలోని పవిత్ర ఫాల్గూనదీ తీరంలో ఇరువురు వృద్ధవనితలు దూరంనుండి పురోహితుని అనుసరిస్తూ ఉచ్చరించిన "ధేన్‌కల్‌సింగ్‌వర్మ కుమార్తె లచ్చమనైన నేను ... ...." అనే మాటలు విని దిగ్భ్రాంతులయ్యారు. సరిగా ఆ సమయంలోనే మరోదిశనుండి "హరిభజనసింగ్‌వర్మ కుమారుడు బదల్‌సింగ్‌నైన నేను ... ...." అనే మాటలు వినవచ్చాయి.

ఆ వృద్ధవనితలిరువురూ తమ ముడుతలుపడ్డ చెక్కిళ్ళమీదుగా ఆనంద బాష్పాలు జాలువారుతుండగా ఆ యువతీయువకులను చేరుకొని గద్గద స్వరాలతో "భగవాన్! నా చిట్టితల్లి లచ్చమ్మకదూ!" "శ్రీరామచంద్రా! వీడు నా ప్రాణానికి ప్రాణం బదలుడే!" అని గొణిగారు.

ధేనుకల్‌సింగ్, హరిభజనసింగ్ లిరువురూ ఉత్తరప్రదేశ్‌లోని రోహితఖండ్ ప్రాంతానికి చెందిన రాజపుత్రులు. వీరు యువకులుగా ఉన్నప్పుడు ముస్లిం దారిదొంగలతో చేతులుకలిపారు. వారి భార్యలు పవిత్ర హిందూ వనితలు కావటంవల్ల తమ భర్తల చర్యలను ఆమోదించలేక పోయారు. ఆ దంపతులకు ఒక జంటకు బాదల్, మరొక జంటకు లచ్చమ్మ జన్మించి, వారిరువురికీ వివాహమయ్యాక ఆకుటుంబాలు మరింత సన్నిహిత మయ్యాయి. ఆ ఇద్దరు ఇల్లాళ్ళూ తియ్యగా నచ్చజెప్పి తమ భర్తలను చెడు మార్గం నుండి మళ్ళించగలిగారు. ప్రాయశ్చిత్తంగా హిందూదేశమంతా తీర్థ యాత్రలుచేసి రావటానికి వారిని ఒప్పించగలిగారు. కానీ, ముందు వివరించినట్లుగా బెంగాల్-ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో గోడిఖల్ (Godi-khal) దగ్గిర హిందూ "బార్గీ" లతో పోరాటంలో ఆ రాజపుత్రులిరువురూ మరణించారు. రోహిల్‌ఖండ్‌లోని వారి గ్రామాలలో ఆస్తిపాస్తులన్నీ వారు లేనపుడు వారి సహచరులైన ముస్లిం దోపిడి దొంగలు దోచుకున్నారు. ఈ పోరాటంలో అదృష్టవశాన బ్రతికి బయటపడ్డ లచ్చమాబదల్‌లు తమ సర్వ నాశనానికి కారకులైన మరారాలపై పగ తీర్చుకోవాలని ఎవరికి వారు ప్రత్యేకంగా నిశ్చయించుకొన్నారు. రైబానియా కోటపడిపోయాక లచ్చమ మొగవాడిగా మారువేషం వేసుకొంది. రైబానియా రాణి తన కొంగుకు కట్టిన బంగారు నాణెలు పెట్టుబడిగాపెట్టుకొని తమలపాకులు అమ్మేవాడిగా మరారా సేనలలో కలిసిపోయింది. బాదల్ తన గాయాలు మానిన తరువాత

అలివర్దీ ముస్లిం సేనలో చేరాడు. రెండు సంవత్సరాలవరకూ ప్రతిఒక్కరూ తామొక్కరే ఆనాటి పోరాటంలో బ్రతికి బయటపడ్డ దురదృష్టవంతులమని భావించారు. లచ్చమ్మ, ఆమె తల్లి, అత్తగారు, రాత్రి అంతా ఒకే ఊరిలో గడిపినా, ఒకరినొకరు కలుసుకోకుండా సన్నివేశం కల్పించి పరిగణనీయమైన నాటకీయతను ప్రదర్శించాడు, ఫకీర్‌మోహన్. ఆ కారణంచేత చివరకు అందరూ గయదగ్గర కలుసుకొన్నప్పుడు వారి ఆనందం ఊహించుకోవలసిందే!

ఉపసంహారంలో ఫకీర్‌మోహన్ శృంగార నాయికా నాయకులైన లచ్చమాబాదల్‌లను వనవిష్ణుపురానికి రాజారాణీలను చేసాడు. నవాబ్ ఆలీవర్ది రైబానియా కోటను లచ్చమ పేరుమీదుగా నిలిపాడు. కొత్త రాజారాణీల మానవతను, పరిపాలనాదక్షతను, ధార్మికతను, కథలుగా చెప్పుకొనేవారు.

కానీ, రైబానియా, ముర్షిదాబాద్‌లలాగానే వనవిష్ణుపూర్ వైభవ ప్రాభవాలు సహితం, లచ్చమాబాదల్ సింహాల మరణానంతరం కాల గర్భంలో కలిసిపోయాయి. అందుచేత ఈ మహారచయిత నిరంతర పరిణామ శీలమయిన ప్రపంచగతిని తెలిపే ఒక సుప్రసిద్ధ సంస్కృత శ్లోకాన్ని పేర్కొంటూ నవల ముగించాడు — ఆ శ్లోకం ఇది :

యాదవప్రభువు విడనాడిపోగా,
    ఎక్కడున్నది, ఆనాటి మధుర ?
రఘుపతిరాముడు గతించిపోతే,
    ఎక్కడున్నది కోసల భాగ్యం ?
ఏనాటికి నశింపక ఏ ఒక్కటి నిలువదు -
ఇది తెలిసిన పొందగలవు,
శాంతి నీవు మానవుడా !

# 14

# అస్తమయ దుర్దినము

ఫకీర్ మోహన్ అమోఘమైన ఆత్మకథలోని ఆఖరు మాటలు: "నా ాతికి నేను కావించిన కొద్దిపాటి సేవకూ, నా రచనలద్వారా నేను కావించిన ాషాభివృద్ధికీ, నా జీవితంలోని చివరిదశలో నా దేశస్థులు నన్ను ఘనంగానే సత్కరించారు. 1916లో "బమ్రా" (Bamra) రాష్ట్రం నాకు 'సరస్వతి" బిరుద ప్రదానం చేసింది. 1917లో శీతల వాతావరణంలో ంటక్ వద్ద జరిగిన కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించటానికి నన్ను ఆహ్వానించారు. నా స్వదేశీయుల నుండి నేనెన్నడూ ఆశించనిది, ఈ ప్రత్యేక గౌరవం. ఈ రంగంనుండి నిష్క్రమించబోయే ముందు, నా దేశీయులకూ – నా పాఠకులకూ - అందరికీ వినయపూర్వక వందనా ర్పించుకొంటున్నాను"

ఆ తర్వాత త్వరలోనే 1918 జూన్ 14 వ తేదీన వృద్ధుడైన ఈ మేధావి బలాసోర్‌లోని తన ఏకాంత ఉద్యాన నిలయంలో రంగంనుండి నిష్క్రమించాడు. కాని, పొందదగిన ప్రాభవవైభవాలన్నీ పొందినా, ఫకీర్ మోహన్ వృద్ధాప్యం మాత్రం నిరంతరమూ, శారీరక మానసికయాతనలతో గడవటం అతని దురదృష్టం.

వృద్ధుడైన ఈ మహానుభావుడు తన ఆత్మకథలో తన వ్యక్తిగత జీవితంలోని వ్యథలను సంగ్రహంగా వివరించిన ఒక పేరాలోని కథనం ఇలా ఉంది.

"1915–వ సంవత్సరాంతాన ఒరిస్సా నిస్వార్థ సేవకుడైన గోపాల బంధుదాసు నాతో రెండురోజులు గడిపాడు. అతడప్పుడు బీహార్, ఒరిస్సాల "గవర్నర్ కౌన్సిల్" లో సభ్యుడుగా ఉన్నాడు. పాట్నా నుండి తిరుగు ప్రయాణంలో బలాసోర్‌లో ఆగాడు. అతడు బయలుదేరబోయే రోజు ఉదయాన, జబ్బునపడివున్న నా మంచంపక్కన చలనంలేకుండా నిలిచి, స్థిరంగా నావంక చూస్తూ చెక్కిళ్ళమీదుగా కన్నీరు కార్చటం నేను చూసాను. తన భావోద్రేకాన్ని నిగ్రహించుకొన్న తరువాత నెమ్మదిగా అతనిలా అన్నాడు: "ఇక్కడ గడిపిన రెండు రోజులలో మీ పరిస్థితి పూర్తిగా తెలిసింది. మీరిప్పుడు బలహీనంగా, నిస్సహాయులై, ఒంటరిగా సేవకుల సపర్యలమీద ఆధారపడి ఉన్నారు. మిమ్మల్నిప్పుడు సరిగ్గా చూసు కోవడానికి దగ్గిరవాళ్ళు ఎంతైనా అవసరం."

ఫకీర్‌మోహన్ చివరిరోజులు తీవ్రమైన శారీరకవేదనలతో గడిచాయి. నరాలవాపువలని భరించరాని వేదనతో, అతడు రోజుల తరబడి మంచం పట్టాడు. ఒకసారి పొరపాటున నీళ్లుకలపని గాఢ సల్ఫ్యూరికామ్లాన్ని మందుగా పుచ్చుకోవటంవల్ల చచ్చినంతపనయింది. అనేకరోజుల దుర్భర వేదననుండి కోలుకొన్నాడో, లేదో, అంతలోనే ఒక రాచపుండు బయలుదేరి, దానివంతు యాతననూ, అసౌకర్యాన్నీ తెచ్చిపెట్టింది.

## జీవితేచ్ఛ:

కానీ, రోగాలతో తీసుకుంటూ అశాంతితో కుములుతున్న ఈ వృద్ధుడు సందర్భంవచ్చినపుడు అద్భుతమైన ఉత్సాహాన్ని ప్రదర్శించేవాడు. చిన్న పిల్లవాడిలో ఉండే జీవితంపట్ల ఆ కాంక్ష ఇంకా ఇతనిలో మిగిలిఉంది. వినూత్నమూ, ఆశాజనకమూ, జాత్యభివృద్ధి సూచకమూ, మానవ వ్యథా విముక్తిదాయకమూ, అయిన దేనితోనైనా, అతడు అత్యంత ఆసక్తితో ఏకీభవించేవాడు. పవిత్ర క్షేత్రమైన "పూరి"కి ఉత్తరాన పదకొండుమైళ్ళ దూరంలో, "సఖిగోపాల్" (Sekhigopal) గ్రామంలో పండిత గోపబంధు దాసు నాయకత్వాన ఒరియా విశ్వవిద్యాలయ విద్యావంతుల సంఘం

"సిల్వాన్ అకాడమీ" (Sylvan academy) స్థాపించింది. విద్యాధికులైన ఆ ఉపాధ్యాయులు తమజాతి పునర్నిర్మాణానికి తమను తాము అంకితం చేసుకోవటంవల్ల స్వల్ప వేతనాలతోనే సంతృప్తిపడ్డారు. ఒక దశాబ్దంపాటు ఒరియనుల ఆశలను చిగురింపచేస్తూ ఈ పాఠశాల ఒరిస్సా సాంస్కృతిక కార్యకలాపాలకు కేంద్రంగా నిలిచింది.

తన మరణానికి సరిగా సంవత్సరం ముందు 75 సంవత్సరాలు పైబడ్డ వృద్ధుడైన ఫకీర్‌మోహన్ సత్యబాడి (Satyabadı) పాఠశాలకు వచ్చాడు. ఉపాధ్యాయులు అతడిని ఎంతగానో గౌరవించేవారు. అయినా అతడు వందలాది విద్యార్థులలో ఒకడుగా మసలేవాడు. అతడు పిల్లలతో ఆడేవాడు. పద్యపఠన పోటీలలో పాల్గొనేవాడు. వారితో కలిసి మెలిసి తిని తిరిగేవాడు. తాను తినేపళ్ళేలను, తానే సంతోషంగా శుభ్రపరచు కొనేవాడు.

ఆ పాఠశాలలో అతడు మూడురోజులున్నాడు. సిల్వాన్ వాతావరణమూ, దేశ శ్రేయస్సు కొరకై అక్కడి యువకుల త్యాగశీలత, అతడిని ముగ్ధుణ్ని చేసాయి. ఒకసారి అతడు ఉపాధ్యాయులతో ఇలా హాస్య మాడాడు. "మీ కందరకూ నేను మూర్ఖుడనని తెలుసు. అంచేత ఇక్కడ మీకు విద్యార్థినై ఇంగ్లీష్‌లో "ఎ", "బి", "సి" లు ప్రారంభిస్తే ఎలా ఉంటుంది?"

కానీ, ఆయన వీడ్కోలువాక్యాలు గొప్ప దేశభక్తిని చాటుతున్నాయి. అతడిలా అన్నాడు: "మీరంతా ఇక్కడ ఒక అచ్చమైన స్వాతంత్ర్య వృక్షాన్ని నాటారు. ఇది త్వరలోనే పుష్పించి, చక్కని ఫలాల నందించటం, నేను దర్శించగలుగుతున్నాను. గోపబంధు నిస్స్వార్థ దేశభక్తుడు. జాతీయ కార్యకలాపాలలో ఎంతో అనుభవమున్నవాడు. ఆ కారణంచేతనే అతడు మిమ్మల్ని మనజాతి పునర్నిర్మాణానికి అవసరమైన సరియైన పథకాలలో నియమించగలుగుతున్నాడు. మనదేశ స్వాతంత్ర్యాన్ని చూడటానికి నేను

జీవించిఉండనని నాకు విచారంగా ఉంది. కానీ, మీరంతా ఈ లోకాన్ని వీడటానికి ముందే స్వాతంత్ర్య ఫలాన్ని అనుభవిస్తారని ఆశిస్తున్నాను.

శాంతికానన్ (Shantikanan) లోని యోగి.

ఫకీర్‌మోహన్ అనేక వ్యథలనుభవించాడు. అయినా బలాసోర్‌లో గడిపిన తన అంతిమదినాలలో ప్రకృతితోనూ, సమాజంతోనూ చక్కని సంయమనం సాధించిన యోగి ఇతడు ఆ చివరి రోజులలోని ఫకీర్‌మోహన్ మూర్తిని వివరిస్తూ బలాసోర్‌లోని శ్రీమతి బెలాఘోష్ (Mrs. Belaghose) ఇలా అన్నారు :

"ఇది నా చిన్నతనపు జ్ఞాపకాలలోనిది. అప్పటికి నా వయసు, తొమ్మిది, పది సంవత్సరాలమధ్య ఉండవచ్చును. బలాసోర్‌లోని ఒక పెద్ద మనిషిని చూడటానికి మా అమ్మ వెళ్తోంటే, ఆమెతో నేనూ వెళ్ళాను. ఆ ఇల్లు ఆధునిక లక్షణాలేమీలేకుండా చాలా నిరాడంబరంగా ఉంది. కానీ, ఆ ఇంటిచుట్టూ ఉన్న తోట మాత్రం నాకు చాలా నచ్చింది. దానిలో ఎన్నో అందమైన మొక్కలూ, వృక్షాలూ, విదేశీయమైనవి ఉన్నాయి. ఆ తోట ఎంతో తెలివిగా తీర్చిదిద్దారు – వివిధ వర్ణాల పూవులతో తీవెలతో అది ఎంతో ఆకర్షణీయంగా ఉంది. అక్కడ వివిధజాతుల వైద్యసంబంధమైన మొక్కలు, మనోహరమైన మొక్కలు ఉన్నాయి. ఆ వాతావరణమంతా సౌందర్యంతో మెరిసిపోతున్నట్టు అనిపించసాగింది. ఆ మొక్కలలో, వృక్షాలలో, రంగు రంగుల పూలగుత్తులలో నా పసిమనసు మునిగిపోయి ఉండగా అసాధారణు డైన ఒక ఆజానుబాహువు నెమ్మదిగా మాముందుకువచ్చి నిలిచాడు. ఆ మొక్కలమధ్య మానవత్వం ఒక మహావృక్షమై నిలిచినట్టు నాకనిపిం చింది. బాహ్య ప్రకృతితో సమశ్రుతిలో ఉన్నది, ఆ మహాపురుషుని పరిపూర్ణ వ్యక్తిత్వం – పొద్దుపొడిచినప్పటి భూమాతలా ఆయన ముఖం సర్వోత్కృ ష్టంగా వెలిగిపోయింది. అతని మాటలకూ, మర్యాదలకూ మేమిరువురమూ ముగ్ధులమయ్యాము. అతడు మమ్మల్ని తోటంతా తిప్పుతూ ప్రతిమొక్కకూ – దానిపేరు, సహజమైన అలవాట్లు, అతడు దానిని సంపాదించిన విధమూ,

వైద్యసంబంధ మయినవీ తదితరమయినవీ, సుగుణాలూ, అన్నీ వివరించాడు. తోటంతా చూసిన తరువాత అతని ఇంటిలో ఒకమూల కూచున్నాము. అతడు మాట్లాడుతోనే ఉన్నాడు. కానీ, ఇంతకాలమయ్యాక అదంతా నాకు జ్ఞప్తికి రావటంలేదు. కానీ, ఆశీర్వాదానికై అతని పాదాలనంటినప్పుడు, అతడు పలికిన చివరిమాటలు మాత్రం నాకు స్పష్టంగా గుర్తున్నాయి. "చిట్టితల్లీ! నీ మాతృ దేశాన్నీ, నీ మాతృభాషనూ తెలుసుకోవటానికి ప్రయత్నించు." తిరిగి మా ఇంటికి వెళ్తున్నప్పుడు నా తల్లినుండి అతడు ఫకీర్ మోహన్ సేనాపతి అని తెలుసుకున్నాను".

బలాసోర్‌లోని ఈ "శాంతికానన్" యోగి 1918 జూన్ 14 వ తేదీన మరణించాడు. ఆ "శాంతికాననము" ప్రస్తుతం శిధిలావస్థలో ఉన్న, ఒరియనులకు తీర్థయాత్రా స్థలమయింది. జాతీయ సమైక్యత కావాలని ఘోషించే బ రతీయులు ఒక్కసారి ఈ శాంతికాననం చూసివస్తే ఫలితం దక్కుతుంది. కేథలిక్ అయిన మానవతాయోగి ప్రపంచమతాలన్నింటినుండీ యోగ్యమయిన సూక్తులను గోడలమీద వ్రాయించి వాటిమధ్య కూర్చొని ప్రార్థనచేసే మందిరాన్ని వారు చూడగలరు. విద్యావంతుడుకాని కూలి కుర్రవాడుగా - సమాజంలోని అవాంఛనీయవ్యక్తిగా ప్రారంభమయిన జీవితా నికి నిశ్చయంగా ఇది సముచితమైన సార్థకత! నిస్సందేహమైన మానవశక్తి సామర్థ్యాల కావ్యమే ఫకీర్ మోహన్ సేనాపతి జీవితం. ఆధునిక విద్యాభ్యాసం లేక – మధ్యతరగతి వాతావరణంనుండి వచ్చి – ఈ వ్యక్తి తన దృక్ప ధంలో, ఆలోచనా విధానంలో, ఆనాటి ఒరియాలో అత్యంత ఆధునికు డయ్యాడు. బీదరికంలో పెరిగి మనుగడలోని కష్టాలుమాత్రమే రుచిచూసి, నిరుద్యోగపు దౌర్భాగ్యానికి అలవాటుపడి – అతడు తన తరువాతి జీవితంలో అత్యంత ఉదారుడైన కరుణామూర్తిగా రూపొందాడు. ఈర్ష్యాసూయలకు, అల్పత్వానికి ఆలవాలమైన ఇంటినుండి వచ్చినా, అతడీ క్షుద్రత్వాలకన్నిటికీ అతీతంగా ఎదిగిపోయాడు. అన్యాయాలకూ అక్రమాలకూ మధ్య ఉన్న అతడు తన కప్పగించబడిన బాధ్యతలు నిజాయితీతో నిర్వర్తించాడు.

అంతగా చదువూ, పూర్తిగా తిండీలేని కూలి కుఱ్ఱవాడు తరువాత ఎంతో వైభవంగా సౌఖ్యాలతో జీవించాడు. కష్టించి సంపాదించిన తోట ఇంటినీ, మరికొంత ఆస్తినీ వారసులకు వదిలాడు. ఒకటిన్నర సంవత్సరాల కాలం మాత్రమే విద్యాభ్యాసం చెయ్యగలిగిన ఈ ఆలనా పాలనా లేని శిశువు తన భాషలో ఒక నూతన యుగాన్ని ప్రవేశ పెట్టడం నిజంగా అత్యద్భుతం కదా! ఈ కారణంచేతనే అతడు తన వారి దృష్టిలో ఎప్పటికీ "ఆధునికుడి" గానే నిలిచిపోయాడు. ఇది అందవికారమైన బాతుపిల్ల రాజహంసలా— జుగుప్సాకరమైన గొంగళి పురుగు చక్కని సీతాకోక చిలుకలా—మారి పోవటంలాగ కనిపిస్తుంది. బలాసోర్ రేవులోని కూలిపిల్లవాడి విషయంలో ఈ రకమైన అద్భుత పరివర్తన జరిగింది. అతడు తన జాతిభాషా సారస్వతాలకూ, జాతీయ చైతన్యానికీ, కొత్తరూపాన్ని సంతరించగలిగాడు.

# సాహిత్య అకాడెమీ

## తెలుగు ప్రచురణలు

## నవలలు

| | |
|---|---|
| ఆరోగ్య నికేతనము<br>(బెంగాలీ సాంఘిక నవల)<br>తారాశంకర్ బెనర్జీ<br>అను : జె. సత్యనారాయణమూర్తి | 12-00 |
| గెంజి గాథ (జపాను నవల)<br>మురసకి షికిబు<br>అను: నండూరి రామకృష్ణమాచార్య | 5-00 |
| గోరా (బెంగాలీ నవల) (రెండవ ముద్రణ)<br>రవీంద్రనాథ ఠాకూర్<br>అను: శివశంకర స్వామి | 20-00 |
| పార్థివ స్వప్నము (తమిళ నవల)<br>'కల్కి' రా. కృష్ణమూర్తి<br>అను: యన్ సి. వి. నరసింహాచార్యులు | 7-00 |
| మరల సేద్యానికి (కన్నడ సాంఘిక నవల)<br>శివరామ కారంత్<br>అను : తిరుమల రామచంద్ర | 15-00 |

## కథానికలు

| | |
|---|---|
| 23 హిందీ కథలు<br>సంపాదకులు : జైనేంద్రకుమార్<br>అను : వేమూరి రాధాకృష్ణమూర్తి | 8-00 |
| రవీంద్ర కథావళి<br>అను : మద్దిపట్ల సూరి | 9-00 |
| బీహార్ జానపద గాథలు<br>పి. సి. రాయ్; అను : పాలగుమ్మి పద్మరాజు | 8-00 |

# నాటకాలు

ఏకాంక సంగ్రహం (కన్నడ నాటికలు) 10-00

నం : ఆద్య రంగాచార్య
అను అయాచితుల హనుమచ్ఛాస్త్రి

మదర్ కరేజి (జర్మన్ నాటకం) 10-00

బెర్టోల్ట్ బ్రెష్ట్; అను : వి. యన్. శర్మ

గలీలియో (జర్మన్ నాటకం) **7**-00

బెర్టోల్ట్ బ్రెష్ట్; అను : వి. యన్. శర్మ